# మిసిమి

*"All that we are is the product of what we have thought,"*
*is "We are what we think."* – **Dammapada.**

సంపుటి 6 ఏప్రిల్ 1995 సంచిక 69

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 5/- వార్షిక చందా రూ. 60/-

ముఖచిత్రం :
**The Rising of the Sun 1753**
126 1/2" X 106 1/2" Wallace Collection, London

# ఫ్రాంకాయిస్ బోచెర్(Francois Boucher)

18 వ శతాబ్దంలో అద్భుతమైన అలంకరణా చిత్రకారుడిగా ప్రసిద్ధి చెందిన ఫ్రాంకాయిస్ బోచెర్, ప్యారిస్‌కు చెందినవాడు. బోచెర్ ఇటలీ, వెనీస్, రోమ్ మొదలైన దేశాలలోని కళాఖండాలను అధ్యయనం చేసి తన చిత్రకళను ఇంకా మెరుగు పరుచుకున్నాడు. ఈయన కుంచె నుండి వెలువడిన చిత్రాలలో శృంగారం పాలు అధికంగా వుండి, అందులో కళాత్మక విలువలు నిక్షిప్తమై ఉండటం మనం గమనించవచ్చు. 1733లో 'మేరీ జియన్నె బ్యూసూ' అనే 17 ఏళ్ళ అందమైన యువతిని బోచెర్ వివాహమాడాడు. వివాహానంతరం బోచెర్ సృష్టించిన ఎన్నో కళాఖండాలలో తన భార్యయైన మేరీ జియన్నె రూపాన్ని దేవకన్యకగా చిత్రించాడు.

15వ లూయీ చక్రవర్తి ప్రేయసియైన 'మేడమ్ డి పాంపడోర్' సహాయ హస్తాన్ని అందుకున్న బోచెర్ ఫ్రెంచి విప్లవానికి 20 సంవత్సరాలకు ముందు ఎన్నో అనితరసాధ్యమైన అద్భుత కళాఖండాలను సృష్టించాడు. బోచెర్, 'మేడమ్ డి పాంపడోర్' ఆజ్ఞ మేరకు ఆమె అంతఃపురంలో ఎన్నో అద్భుతమైన కళాఖండాలను చిత్రించాడు. విప్లవ సమయంలో అవి పూర్తిగా నాశనమైపోయాయి.

బోచెర్ కుంచె నుంచి సృష్టింపబడిన అద్భుతమైన కళా ఖండాలలో ఒకటైన ''సూర్యోదయం''(The Rising of the Sun) మొదట నలుపు, తెలుపు వర్ణాలలోనే చిత్రించినప్పటికీ 'మేడమ్ డి పాంపడోర్' అనతి మేరకు తరువాత పంచరంగులలో చిత్రించడం జరిగింది. ఈ చిత్రంలో బోచెర్ కళా ప్రతిభ మనకు గోచరమవుతుంది. గ్రీకు దేవతలలో ప్రధానుడైన 'అపోల్లో' ఆకాశాయానానికి తన రథంపై బయలుదేరటం, అపోల్లోనభిమానించే 'జలకన్యలు' అతని ప్రయాణానికి అనువైన వాతావరణాన్ని ఏర్పరుస్తూండటం "The Rising of the Sun" చిత్రంలో చూడవచ్చు. ఈ చిత్రంలో బోచెర్ అలంకరణా వైశిష్ట్యం ప్రస్ఫుటంగా కనబడుతుంది. ఈ కళా ఖండంలోని బొమ్మల హావభావ ప్రకటనలు చూసే కొద్దీ వీక్షకులకు వింత వింత భావాలను కలిగిస్తాయి.

# మెదడుకు మేత

## ''మిసిమి సాహితీ మథనం''

1. దండి సంస్కృతమున గద్యమందు రచించిన ''దశకుమార చరిత్రము''ను కవిబ్రహ్మ తిక్కన మిత్రుడగు మూలఘటిక కేతన చంపూగా రచించి తిక్కనకు అంకితమిచ్చెను. ఇందలి విశేషమేమి?
2. తెలుగు నందు మొదటి శతకమని పేరుబడ్డ ''శివతత్త్వసారము'' (వీరశైవ మతప్రచారములో తెలుగున మొదటి గ్రంథము) ను రచించినదెవరు?
3. తన కావ్యమందలి శృంగార వర్ణనము విన్న యతియైన విటుడగుననియు, వైరాగ్య వర్ణనము విన్న విటుడైన యతి అగుననియు చెప్పిన కవి ఎవరు?
4. భోజరాజీయమును తెనిగించినదెవరు?
5. సుమతి శతక కర్త ఎవరు?
6. తెనుగునందలి ఉదాహరణ కావ్యములన్నిటిలో ఉత్తమమైనదేది? కవి ఎవరు?
7. తెలుగునందలి ద్విపద కావ్యములలో శ్రేష్ఠమైన ''రంగనాథ రామాయణము''ను రచించినదెవరు?
8. ప్రబంధమననేమి?
9. ఆంధ్ర సాహిత్యమున మొదటి జంటకవులెవరు?
10. 'వికటకవి'గా సుప్రసిద్ధుడైన కవి ఎవరు?

సాహితీ మథనంలో మీ మేధను పరీక్షించుకోండి! అన్ని ప్రశ్నలకు సరైన సమాధానాలు వ్రాసిన వారికి చిన్న బహుమతి ఇవ్వబడును.

సూచన :- జవాబులను కార్డులపై మాత్రమే రాయాలి. 'సాహితీ మథనం, మిసిమి' ప్లాట్ నం.337, రోడ్డు నం.10, జూబ్లీ హిల్స్, హైదరాబాదు-33 అనే చిరునామాకు పంపగలరు.

# కావ్యజగత్తునుంచి - జగత్కావ్యం వైపు

– 'జ్యేష్ఠ'

*('జ్యేష్ఠ'గా ప్రసిద్ధులైన ఐ.సి.హెచ్.వి. బసవరాజుగారు 1939లో జన్మించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఇంజనీరింగ్ కళాశాలలో రీడరు, శ్రీకృష్ణుడు, శంకరాచార్య, మార్క్స్, మహర్షి మహేష్ యోగులను అభిమానిస్తారు. ''ట్రాన్సెన్డెంటల్ మెడిటేషన్'' ద్వారా నవ సమాజనిర్మాణం వీరి జీవితలక్ష్యం.)*

నవల, నాటకం, కథ, కావ్యం... అన్ని సాహిత్య ప్రక్రియలలోనూ తన ప్రతిభనూ సృజనాశక్తినీ ప్రదర్శించిన శ్రీ జి.వి.కె. (డాక్టర్ జి.వి. కృష్ణరావు) సాహిత్యవిమర్శలో క్రొత్తబాట ఏర్పరిచారు. కావ్యశిల్పంలో శ్రీ విస్సకోట మాధవరావు చెప్పినట్లు ''కావ్యకల్పన యందు కవికి కావ్యశరీర వివిధాంగనిర్మాణశిల్పజ్ఞానమెంత యవసరమో విమర్శకునకు కూడా అంతియే యవసరమనియు, కావ్యములో కవి యాత్మీయత ప్రదర్శించుటకు గల సదవకాశము విమర్శకునకు ఉండదనియు, అందుచే కవికి గల భావుకత్వమును మించిన భావుకత్వము, సంయమనము విమర్శకునకు, కావలయునని భావించవలయును.'' ఈ ప్రకారం చూస్తే తెలుగు సాహిత్యవిమర్శకులు చాలామంది చేసేది విమర్శకాదనీ, వాళ్ళ సొంత అభిప్రాయాల ప్రకటన మాత్రమేననీ తేలుతుంది. భావుకత్వం, మేధాశక్తి, లోకజ్ఞానం, పాండిత్యం సమపాళ్ళలో ఉన్నవాడే మంచి విమర్శకుడు. అలాంటి సద్విమర్శకులు కొద్దిమందిలో డాక్టర్ జి.వి. కృష్ణరావు ప్రథమశ్రేణికి చెందినవారు.

శ్రీ జి.వి.కె. రచించిన మొదటిగ్రంథం ''కావ్యజగత్తు''. అప్పటికే రాడికల్ హ్యూమనిస్టు ఆయన. రచయిత దాన్ని మార్క్సిస్టు దృక్పథం అని ఎందుకన్నారో తెలీదుకాని, సగటు మార్క్సిస్టుల మడీ, ఆచారం ఇందులో మచ్చుకైనా లేకపోవడం మనకు ముచ్చట గొల్పుతుంది. ఈ 83 పేజీల పుస్తకంలో మార్క్సిజాన్ని ఫ్రాయిడ్ సిద్ధాంతాల్నీ, ప్రాచీన అలంకార శాస్త్రాలనీ సమన్వయం చేసి కొత్తసాహిత్యసిద్ధాంతాన్ని ప్రతిపాదించటమే రచయిత లక్ష్యం. పూజా పునస్కారాలులేక బూజుపట్టినవి ప్రాచీనుల సిద్ధాంతాలు. పుట్టడమే దోషభూయిష్ఠంగా పుట్టినవి మార్క్స్, ఫ్రాయిడ్ వాదాలు. పాతవాటిని బూజు దులిపి వాడుకోడం, కొత్తవాటికి పుటాలు పెట్టి శుద్ధిచేసి సాధుత్వాన్ని కలిగించడం నిజమైన ప్రతిభ ఉన్నవాళ్ళు చేసే పని. ఎంతో సూక్ష్మ దృష్టి, భావసంయమనం ఉంటే తప్ప ఈ యత్నం విజయం కాదు. అందుకే ''కావ్యజగత్తు''కు తెలుగుసాహిత్యంలో అపూర్వస్థానం.

కావ్యజగత్తు చదువుతుంటే, శ్రీశ్రీ కవిత్వం నించి వచ్చే ''థ్రిల్'' లాంటిది వస్తుంది. కాదా మరి? సద్విమర్శకుడు కవులను మించిన కవి. అలాంటి విమర్శకుడు శ్రీ జి.వి.కె.వివిధ ప్రాచీన, ఆధునిక కళాసిద్ధాంతాలనూ, వాదాలనూ ఆయన క్లుప్తంగా చర్చిస్తారు; సమాజానికీ కళకీ భాష ద్వారా ఏర్పడిన అవినాభావసంబంధాన్ని చిత్రిస్తారు; కళలలో కవిత్వానికి గల ప్రత్యేకస్థానాన్ని, విశిష్టలక్షణాన్ని వివరిస్తారు; కావ్యశిల్పానికీ, స్వప్నశిల్పానికీగల భేదాభేదాలను గమనిస్తారు. చివరకు మార్క్స్ చారిత్రక భౌతికవాదాన్ని సమాజ సాహిత్యపరిణామాలకి మూల సూత్రముగా స్వీకరించి దాని కోసం విలువైన కొన్ని పేజీలు రచించారు. తెలుగులో ''కావ్యజగత్తు''లాంటి పుస్తకం నభూతో నభవిష్యతి

కావ్యజగత్తు నార్ల వారి మాటల్లో ''- వ్రాసింది 82 పేజీలే అయినప్పటికీ ఒక జగత్తును దానిలో యిమడ్చగలిగారు. మీ పుస్తకం యెంత సంగ్రహంగా ఉందో అంత సమగ్రంగా ఉంది. మీరు వ్రాసిన

ఒక్కొక్క వాదం సూత్రం వలె ఉన్నదంటే ముఖస్తుతి చేస్తున్నానని అనుకోబోకండి.'' అలాగే శ్రీ కొడవటిగంటి కుటుంబరావు ''కావ్యజగత్తు'' అపూర్వమైన పద్ధతిలో సాహితీ జిజ్ఞాసువు లందర్నీ వేధించే ప్రశ్నలకు సవ్యమైన సమాధానం ఇస్తుందంటూ ''ఈ దృష్టి సాహిత్య వాతావరణంలో విస్తరించిన నాడు మనం సవ్యమైన సాహిత్యం సులువుగా సృష్టిస్తాం'' అని ఆశించారు. కాని ఆయన ఆశించినలాంటి సాహిత్యం ఇంత వరకూ ప్రజలకు లభించనే లేదు.

''విశేషంగా పొగడదగినది'' అంటూ 'కావ్యజగత్తు'ను గురించి శ్రీ అబ్బూరి రామకృష్ణారావు అన్న మాటలు గమనార్హం....''విశ్వసాహిత్య దృష్టిలో చెప్పుకో దగ్గ మహాకవిగాని, కావ్యంగాని నేటివరకూ అవతరించలేదు. దీనికి ప్రబలమైనకారణం లోకవృత్తానికీ, మన సాహిత్యానికీ కలిగిన విరోధం -''. ఆ తర్వాత శ్రీ శ్రీ ''మహాప్రస్థానం'' ఒక్కటి వచ్చిందికాని శ్రీ అబ్బూరి 1942లో ఇచ్చిన తీర్పు ఇప్పటికి[1980కి]నిజమయ్యే ఉంది. నేటి రచయితల అధ్యయనంలో లోపం లేదు; కాని, నిజమైన సాహిత్య, సృష్టికి ప్రాణంలాంటిది మరేదో ఉండాలనీ, అది ఉండటం లేదనీ తేలుతోంది. అదేమిటో శ్రీ జి.వి.కె. వివరించారని ఈ వ్యాసం చివరకు తెలుస్తుంది.

'సరియైన సామాజిక దృక్పథం ఉండాల్సిందే. దాని కాధారం మార్క్సిజం కావచ్చు, వార్తాపత్రికలు కావచ్చు. మార్క్సిజం క్షుణ్ణంగా చదివి దాన్ని జీవితానికీ, కళకీ అన్వయిస్తే మంచి సాహిత్యం వస్తుందనడం హాస్యాస్పదం. మార్క్సిజం గత నూరేళ్ళకు పైగా సమాజంలో వ్యాపించి ఉంది. కాని తెలుగులోనే కాదు; ఏ భాషలోనూ మార్క్సిస్టులు మహాకావ్యాలు, నవలలు ఇంతవరకు రాయలేదు. మార్క్సిజానికి, కళకూ చుక్కెదురు. కళకు లక్ష్యం ఆనందం అని అలంకార శాస్త్రం అంటే, కాదు రాజకీయ ప్రయోజనం అంటుంది మార్క్సిస్టు సిద్ధాంతం. ఈ రెండు వాదాలకీ పొత్తెక్కడ? రైలు పట్టాలు ఎక్కడో దూరంగా కలుస్తున్నట్లు కనిపిస్తాయే, అలాగే రాజకీయలక్ష్యాలు, కళాలక్ష్యాలు కలుస్తాయనే భ్రమ క్రిస్టఫర్ కాడ్వెల్‌కీ, కావ్యజగత్తు రచయితకీ కూడా ఉండేది. కాని. నీతి వేరు, రాజనీతి వేరు; కళలో వచ్చే ఆనందం వేరు. భౌతికసుఖం వేరు. ఇది కామన్ సెన్స్.

'కావ్యజగత్తు'లో ఎన్నో సుగుణాలతోబాటు లోపాలు గూడ ఉన్నాయి. దాన్ని ప్రామాణిక గ్రంథం అనడం శ్రీ జి.వి.కె.ని అవమానించడమే. అందులోని తన అభిప్రాయాలన్నిటినీ ఆయనే తర్వాత వదులుకున్నారు. రెండో లోపం (అంతర్గతం) పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు. స్థలాభావంవల్ల మూడు ఉదాహరణలు మాత్రం ఇస్తున్నాను.

1. ''నేను కేవలం కళకోసమే వ్రాశానన్న ఆస్కార్‌వైల్డ్ యొక్క 'పిక్చర్ ఆఫ్ డొరియన్‌గ్రే' కూడ జీవితంలోంచి బయలుదేరిందే. ఆ పుస్తకంలోనిది ప్రత్యేకప్రపంచంకాదు. దానిలో ప్రాపంచిక జీవితం, శ్రేయస్సు ఉన్నాయి. ప్రాపంచికానుభూతి గలిగిన పాఠకుడే ఆ పుస్తకాన్ని చదివి ఆనందించగలుగుతున్నాడు. కాబట్టి యీ వాదన నిలువదు'' (2,3 పేజీలు).

ఆస్కార్‌వైల్డ్‌ది చారిత్రక భౌతికవాదం కాదు, కాని అతని రచనవల్ల ఆనందం, శ్రేయస్సు లభిస్తున్నాయని శ్రీ జి.వి.కె. అంగీకరిస్తున్నాడు. చారిత్రక భౌతికవాదం సాహిత్యసృష్టికి అనవసరం అని తేలిపోయింది కదా!

2. ''బోడితలకూ మోకాలికీ ముడి పెట్టినట్టుగా, ఈసాహిత్యసిద్ధాంతం (సర్రియలిజం) ఫ్రాయిడ్ సిద్ధాంతానికీ, మార్క్సిజానికీ లంకె వేసింది... ... యీ సిద్ధాంతాలు కలుపు మొక్కలు పెంచడానికి వచ్చినవేకాని, పూర్వ కావ్యాలను కాని, ఇప్పటి కావ్యస్వరూపాన్ని కాని, ముందు రాబోయే కావ్యస్వరూపాన్ని కాని అర్థం చేసుకొని ఆనందించటానికి తోడ్పటంలేదు'' (పే. 4,5). ఆ తర్వాత చాలా పేజీలు ఫ్రాయిడ్‌తో నిండి ఉంటాయి. 'మార్క్సిస్టు దృక్పథం'లో ఫ్రాయిడ్‌కి కూడా స్థానం ఏర్పడింది!

3. ''కవిభావన దైవప్రేరణవల్ల లోకాన్ని అతిక్రమించి పోతుందన్ని చాలామంది అభిప్రాయం.... ఇలాంటి అభిప్రాయం. ఆధునిక శాస్త్రాలు కష్టపడి పరిశోధించి కనుగొన్న సత్యాలను గుర్తించలేదని తెలుపుతుంది'' (పే. 17).

పింగళి సూరన కావ్యసిద్ధాంతం (విశిష్టాద్వైతం ప్రకారం) కవిభావన దైవప్రేరణవలన లోకాన్ని అతిక్రమించి పోతుందనే; ఆమాటకొస్తే దైవమే తన భక్తుడైన కవిద్వారా పలుకుతాడని. కళాపూర్ణోదయం మీద శ్రీ జి.వి.కె. వ్రాసిన Ph.D. థీసిస్ చివరి వాక్యాలు ఇవి. ""Apart from these three minor faults Kalapurnodayam is superb and Unique. In conception and presentation, in plot and character delienation, and in breadth and depth, it is marvellows and occupies a high place in the best literary works of the world". సాహిత్యానికి సార్వకాలీనత, సార్వజనీనత వున్నాయని తేలిపోయాక, చారిత్రక భౌతికవాదం పరిమిత సిద్ధాంత మని వేరే చెప్పనక్కర్లేదు. పింగళి సూరన అపురూప మహాకావ్యంలో మూడు చిన్న లోపాలున్నాయంటారు శ్రీ జి.వి.కె. చారిత్రక భౌతికవాదాన్ని పూర్ణసత్యదర్శనంగా భావించినవాళ్ళ కవిత్వంలో అయితే ఒక్క లోపమే ఉంటుంది. కవిత్వం వ్రాయబూనటం. మార్క్సిస్టు మహామేధావి క్రిష్టఫర్ కాడ్వెల్ మార్క్సిజం స్వీకరించగానే కవిత్వం నశించడం కొందరు కవులలో చూశానంటాడు. ఆర్థిక అవసరాలకి ఈశ్వరత్వం ఆపాదిస్తుంది మార్క్సిజం; అదొకనేలబారు సిద్ధాంతం. అంటే జీవితంలో కొన్ని విషయాలకే వర్తిస్తుంది; పూర్తిగా నిష్ప్రయోజనం కాదు.

భారతీయదర్శనాలు మార్క్సిజంలా కాకుండా సృష్టిలోని అన్ని శక్తుల్నీ దర్శించినవి. వాటిని స్థూలం, సూక్ష్మం అని విభజించి, ''స్థూల భౌతికాచరణ, సామాజికాచరణ, సూక్ష్మ భౌతికాచరణ, ధ్యానం'' అన్నాయి. స్థూలం కంటే సూక్ష్మంలో శక్తి, చైతన్యం ఎక్కువ కనుక, సూక్ష్మంలో మోక్షం అన్నాయి. సిద్ధాంతం చాలదు; ఆచరణ ఉండాలి. ఆచరణనే యోగసాధన అన్నారు. యోగసాధన ద్వారానే మనిషికి పూర్ణవికాసం వస్తుంది.

All life is Yoga అంటారు శ్రీ అరవిందులు. భావం, మాట, పని. ఈ మూడింటికీ సామరస్యం సాధించాలనే ప్రతి మానవుడి ఆరాటమూను. చిత్తశుద్ధితో ఏం చేసినా యోగమే. శ్రీ జి.వి.కె. మార్క్సిజంలో, అంతేకాకుండా ఇతర దర్శనాల అధ్యయనం చాలా తీవ్రంగా చేశారు. తత్ఫలితంగా మార్క్సిజం, రాడికల్ హ్యూమనిజంలలో ఉండే పరిమితులు తెలిశాయి. ఆ వెంటనే ఆయన జీవితంలోకి వచ్చింది కళాపూర్ణోదయం-రెండర్థాలతో. (కళాపూర్ణోదయంపై ఆయన Ph.D.థీసిస్ వ్రాశారు; ఆయన కళా స్వరూప జ్ఞానమూ పూర్తిగా ఉదయించింది.) అదొక మహోదయం. గొంగళిపురుగు సీతాకోక చిలకై విహరించినట్లు శ్రీ జి.వి.కె. భావన అద్భుతంగా వికసించింది.

శ్రీ జి.వి.కె. కళాపూర్ణోదయ విమర్శ ప్రపంచ సాహిత్యంలోనే ఒక అపురూపం. అదే కాలంలో ఆయన ఆచార్య నాగార్జునుని 'విగ్రహ వ్యావర్తని' అనే అద్వైతగ్రంథాన్ని అధ్యయనం చేయడం, అనువదించడం, పరమ ప్రమాణంగా స్వీకరించడం జరిగాయి. 'విగ్రహవ్యావర్తని' (అనువాదం, వ్యాఖ్యానం) వేదాంత తత్వవేత్త పండిత గోపదేవ్‌కి అంకితమై, మరొక తత్వవేత్త శ్రీ వేలూరి శివరామశాస్త్రి హర్షాన్నీ, ప్రశంసనూ పొందింది. పుట్టుకతోనే జిజ్ఞాసువు శ్రీ జి.వి.కె. మార్క్సిజం ఆయన అన్వేషణలో ఒక మైలురాయి; ఒక మెట్టు; చాలా అవసరమైన ఘట్టం. దాని ప్రభావమే ఆయన అద్వైత వేదాంతానికి ఒక నిండుదనం ఇచ్చింది; వేదాంతుల మూఢ నమ్మకాల బారినుంచి ఆయనను కాపాడింది.

ఈ తాత్త్వికచర్చ ఎందుకంటే, ప్రతి సాహిత్యవిమర్శలోనూ విమర్శకుని జీవిత దృక్పథం ఉంటుంది. 'కావ్యజగత్తు'లో శ్రీ జి.వి.కె. అన్నట్లు ఆలంకారికుల వివిధ కళాసిద్ధాంతాల వెనుకనూ వాళ్ళ వాళ్ళ తాత్త్వికసిద్ధాంతాలు (న్యాయం, మీమాంస, శివాద్వైతం వగైరాలు) వున్నాయి. మార్క్సిజం తృప్తికరమైన అలంకారశాస్త్రానికి హేతువు కాజాలదు. ఈ సత్యాన్ని అంత చిన్న వయస్సులోనే 'కావ్యజగత్తు' నాటికే గుర్తించిన ప్రతిభాశాలి శ్రీ జి.వి.కె. మార్క్సిజంలో ఫ్రాయిడ్ మతం, ప్రాచీనాలంకారికుల సిద్ధాంతాన్నీ ఇమడ్చాలని విఫలప్రయత్నంచేశారు.

కాని మార్క్సిజం ఏది భౌతికమో ఏది అభౌతికమో తెలియని భౌతికవాదం. దానికి అసహనం ఎక్కువ,ఇతర సిద్ధాంతాలని దగ్గరకు రానీయదు. కాని అద్వైతం దానికి సరిగ్గావ్యతిరేకం. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అంటుంది. నారింజపండు తొక్క ఎప్పుడూ తీయగా ఉండదు; కాని నారింజపండు అన్నప్పుడు తొక్కతో సహానే భావిస్తాం. లోపల తియ్యగా ఉంటుంది. కనుక నారింజపండు తీయన అంటాం. స్థూలదృష్టి పండులో రసాన్ని చూడదు; తొక్కనే చూస్తుంది. అలాగే జీవితమూను మార్క్సిజం జీవితానికి స్థూల అవగాహన. వేదాంతం స్థూలం, సూక్ష్మం, కారణం అని మూడు శరీరాలను గుర్తిస్తుంది. మనిషిలో శరీరానికీ మనస్సుకీ ఉన్న అవినాభావసంబంధాన్ని, వ్యక్తికి సమష్టికీ ఉన్న ఏకతను దర్శించారు ఋషులు. జీవితం సత్యం, శివం, సుందరం అన్నారు.

నాట్యశాస్త్రానికి మూలం ఎవ్వరు? నటరాజైన ఈశ్వరుడు. కళ జీవితం అంతటా ఉంది; కాని అంతర్గతంగా ఉంది. పైపైన చూస్తే 'చేదు విషం జీవఫలం', లోతుగా చూస్తే 'కవితామయమేనోయ్ అన్నీ.' మళ్ళీ మాట్లాడితే 'కాదేదీ కవిత కనర్హం'. ఈ మధుర రహస్యాన్ని ప్రాచీన ఆలంకారికులు, మహాకవి శ్రీశ్రీ తోబాటు నిజమైన కవులూ, శ్రీ జి.వి.కె. గుర్తించి, అనుభవించి, పరవశించారు. జి.వి.కె. సహజభావుకత అద్వైత జ్ఞానంలో సంపూర్ణవికాసంపొంది. కళాపూర్ణోదయ కావ్యంలోని అన్ని అందాలనూ మన కందించడమేకాక, ఇతర విమర్శకులు గమనించని మరో గొప్ప విషయాన్ని ప్రకటించింది.

'కళాపూర్ణోదయ విమర్శ' ప్రాశస్త్యాన్ని మాటల్లో చిత్రించే శక్తినాకు లేదని విన్నవిస్తున్నాను. ''కళాపూర్ణోదయ కావ్యతత్వమును చెప్పబూనుట సముద్రమున కేతము పట్టుట.'' అని డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు అన్నట్లే శ్రీ జి.వి.కె. థీసిస్ గురించి నేనూ అంటాను. సుబ్రహ్మణ్యంగారి మాటల్లో ''అట్టి మార్గమున (ప్రాచ్య, పాశ్చాత్య సిద్ధాంత సమన్వయదృష్టితో) నడిచి డా. జి.వి. కృష్ణరావు గారు కళాపూర్ణోదయ కావ్యప్రాశస్త్యమును నిరూపించు గొప్పగ్రంథము రచించినారు. అది "Studies in Kalapurnodayam'. అందు వారు పింగళిసూరన విశిష్టాద్వైతసిద్ధాంతము ననుసరించి సమగ్రకావ్య కళావిష్కార సిద్ధాంతమును తన కావ్యమున ప్రవచించెనని ప్రతిపాదించినారు. పూర్వ విమర్శలకు సమాధానము లిచ్చినారు. ఇక్కడ పూర్వవిమర్శకులు శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, సర్ సి.ఆర్. రెడ్డి పభృతులు. వారి విమర్శలకు శ్రీ జి.వి.కె ఇచ్చిన సమాధానాలు చదువుతుంటే వీరావేశం వస్తుంది. నిజానికి కళాపూర్ణోదయానికి మొట్టమొదటగా రావలసిన గుర్తింపు తెచ్చినవారు రెడ్డిగారే కాని ఆయనకు కొన్ని ఘట్టాల్లో సంప్రదాయవ్యతిరేకవాసనలు గట్టిగా పట్టుపట్టడం చేత 'సహృదయత' అక్కడక్కడ తెరవెనుకనే ఉండిపోయి హేతువాదం, శాస్త్రీయదృక్పథం అనవసరంగా కలగజేసుకున్నాయి. మణిహార వృత్తాంతం నిండా యాదృచ్ఛికమైన మలుపులుండడం ఆయనకు నచ్చలేదు. అలాగే పింగళి సూరన అద్వైతి అనీ, కృతిభర్తను మెప్పించడానికి కక్కుర్తితో వైష్ణవం (విశిష్టాద్వైతం) నటించాడనీ గేలి చేశారు; అంతతేలికగా ప్లేటు ఫిరాయించే లక్షణం ఉన్నవాడు మహాకవి ఎలా అవుతాడో అనే ఆలోచనే రాలే దాయనికి. అలాగే ఆరో అశ్వాసం 192వ పద్యం తర్వాత కావ్యం అనవసరంగా

పొడిగింపబడిందన్నారు శ్రీ రెడ్డి. సౌందర్యం, ఔచిత్యం, ఆవశ్యకత లోపించా యన్నారు. శ్రీ జి.వి.కె. ఈ నిందలను ఖండించి, చివరిభాగంలో కావ్యసౌందర్యం ఏమీ లోపించలేదనీ ఆ మాటకొస్తే కావ్యాన్ని ఆరవ ఆశ్వాసంతో ఆపేస్తే పాఠకులకు ఎలా చికాకు, అసంతృప్తికలిగేదో, కథ అర్థాంతరంగా ఉండిపోయేదో వివరించారు.

థీసిస్‌లోని పై విషయాలు ఒక యెత్తు; కావ్యంలోని అలంకారశాస్త్రాన్ని గుర్తించి ప్రదర్శించడం మరో యెత్తు. శ్రీ జి.వి.కె. కనుగొన్న రహస్యం ఇది: కళాపూర్ణోదయం మామూలు సహృదయతతో చదివితే ఒక అపూర్వసంవిధానం కల్గిన (మొదటి) తెలుగు కల్పిత కథాకావ్యం; సూక్ష్మంగా చూస్తే విశిష్టాద్వైతసిద్ధాంత పరంగా రచించిన అలంకారశాస్త్రం. అంటే కళ అనేది ఎక్కడ ఎలా అంకురించి, ఎలా పూర్తిగా వికసిస్తుందో అనే వివరణ ఈ కావ్యం అంతటా ఉంది. రెండు రెండర్థాల కావ్యాల్ని సూరన రాశాడు; రాఘవ పాండవీయంలో రామాయణ, భారత కథలు కలిసి నడుస్తాయి. కళాపూర్ణోదయంలో కళాపూర్ణుడు అనే ధీరోదాత్త నాయకుని చరిత్రతోబాటు, 'కళ' అనే జీవితపరమార్థపు పుట్టుపూర్వోత్తరాల చరిత్ర కూడా ఉంది.

సూరన విశిష్టాద్వైతి. విశిష్టాద్వైతం ప్రకారం పరబ్రహ్మ శరీరమే ఈ చరాచర జగత్తు. జీవులందరూ పురుషోత్తముని వివిధ అంగాలు. జీవుడు పాక్షికపరిపూర్ణత. జీవాత్మ దేహానికి ఎలాగో, పరమాత్మ, జీవాత్మకి అలాగ. భక్తి, ఆత్మ సమర్పణం ద్వారా జీవుడు దేవుని దీవెనలు పొందితేనే కళాస్రష్ట కాగలడు. శ్రీశ్రీ చెప్పినట్లు 'నీ ప్రాబల్యంలో చిరదీక్షా శిక్షా తపస్సమీక్షణలో, నిశ్చల సమాధిలో' మాత్రమే, కవికి జగత్కావ్యంలోని కవిత్వం దర్శనమిస్తుంది. సృష్టి భగవంతుడు విరచించిన మహాకావ్యం; కవి సృష్టి (కావ్యం) ఆ సృష్టికి ప్రతిబింబం.

'కళాపూర్ణోదయం'లో కళాపూర్ణుడు అనే నాయకుని కథ బ్రహ్మ, సరస్వతికి చెప్పినట్లుంది. ఎప్పుడు చెప్పాడాయన? ప్రణయకలహం సందర్భంగా. సరస్వతీ చతుర్ముఖులు ఒక మణి స్తంభంలో దగ్గరగా ప్రతిబింబించబడినప్పుడు. మణి స్తంభం అంటే దివ్యదృష్టి, కావ్యంలో మణిస్తంభుడు. సుముఖాసత్తి మణిస్తంభుడి భార్య; ఆ పేరుకి మరో అర్థం దగ్గర చేరడం (ఉపాసన) అని. ఈ దంపతులు కళాపూర్ణుడి తల్లిదండ్రులు.

కళాపూర్ణోదయంలో కళావిలసన 'చరిత్ర' ఉంది అనే రహస్యాన్ని గుర్తించిన శ్రీ జి.వి.కె. మొత్తం కావ్యాన్ని ఆ దృష్టితో వర్ణించడం చాలా హృద్యంగా ఉంటుంది. కళ దివినుంచి భువికి వస్తుంది; కాని భూమిమీదే జీవిస్తుంది. కళాపూర్ణుడి జన్మకు బీజం సత్యలోకంలో; ఎదుగుదల గంధర్వలోకంలో; జీవనం, విజయం భూలోకంలో. 'కళాపూర్ణుడు' అనేక రాజ్యాలను జయిస్తాడు. అలాగే కళ మనిషిలోని అధమత్వాన్ని నేలబారుదృష్టిని జయిస్తుంది. 'కళాపూర్ణోదయం'లో కథ, ఉపకథలు, పాత్రలపేర్లు, స్థలాల పేర్లు, పాత్రలతత్వం - ప్రతి అంశం ఏ విధంగా కళ యొక్క పూర్ణోదయాన్ని చిత్రిస్తుందో ప్రతిభావంతంగా వివరిస్తారు శ్రీ జి.వి.కె. 'కళాపూర్ణోదయ విమర్శ' శ్రీ జి.వి.కె.ను ప్రపంచసాహిత్య విమర్శకులలో అగ్రశ్రేణికి తీసుకెళ్ళింది. ఆ తర్వాత ఆయన రచించిన 'నవ్యతోరణం' వ్యాసాలలోని పరిపూర్ణత సహృదయులకు పారవశ్యం కలిగిస్తుంది. వ్యాసంలో వస్తువు వ్యాకరణం కావచ్చు, పేరిగాడు కావచ్చు, ఛందశ్శిల్పం కావచ్చు, వేమన కావచ్చు, హృదయోల్లాసం కావచ్చు, సర్వజ్ఞ సింగభూపాలుడు కావచ్చు. కాని, ప్రతి వ్యాసంలోనూ శ్రీ జి.వి.కె. సమగ్ర విజ్ఞానం, సహృదయత, హృద్యమైన శైలి సాక్షాత్కరిస్తాయి.

జీవితం రెండర్థాల కావ్యం అయినట్లే, పురుషులందు పుణ్యపురుషు లున్నట్లే విమర్శకులలో రెండు రకాలు: విమర్శకులు, శ్రీ జి.వి.కె. వంటి విమర్శకులు.

మహానుభావుడు శ్రీ జి.వి.కె.

'జ్యేష్ఠ' గారిచే 1980 లో ప్రచురింపబడిన వ్యాసం పునర్ముద్రణ

# నవ్వుల లోకంలో వెన్నెల పూలు

– సత్తెనపల్లి రామమోహన్‌రావు

''నేనేం అలా అన్లేదు. పండుగ నాడూ పాత మొగుడేనా అని కాదు - పండుగ నాడూ పాత చీరేనా అన్నాను అదీ తప్పేనా?..'' అంటూ రుసరుసలాడింది హాసిని.

''అలా అన్నా తప్పే. ఉగాది పండుగ చీరల పండుగ కాదు. షోకుల పండుగ అంతకన్నా కాదు. చేదు తీపుల కలయికతో జీవితాన్ని నిర్వచించే పండుగ -'' అన్నాడు ఆనందం.

''అలాగా... అంత సీరియస్ పండగే అయితే కాసిని సరదా కబుర్లు చెప్పుకోవాల్సిందే. ఏమన్నా జోకులు చెప్పండి-''

''నీకంతా హాస్యంగా వుందే-'' అన్నాడు ఆనందం కోపంగా.

''లేదు లెండి - కానీ అసలు హాస్యం అంటే ఏమిటండీ? -''

హాసిని అయితే తేలికగా అడిగింది కాని ప్రశ్న వింటూనే ఆనందం గంభీరంగా మారి పోయాడు.

## హాస్యం అంటే....

హాస్యం అంటేనా? - ''వికృతాకార వాగ్వేష చేష్టాదేర్కుహకాద్భవేత్ హాస్యో హాస స్థాయి భావః'' - అంటూ హాస్య రసాన్ని నిర్వచించారు అలంకారికులు. హాస్యంలో మళ్ళీ ఆరు రకాలున్నాయి-''

''ఆవకాయలో ఏడు రకాలున్నట్లు. ఉల్లావకాయ, బెల్లపావకాయ, కాయావకాయ, మెంతావకాయ-''

''చాలించు నీ ఆవకాయ గొడవలు. ఎంతటి గంభీరమైన విషయాన్నయినా ఆటలు పట్టించేస్తావు-'' అని విసుక్కున్నాడు ఆనందం.

''హాస్యం గంభీరమయిన విషయమాండి? నాకు తెలియదే-'' అంది అమాయకంగా హాసిని.

''నీకెలా తెలుస్తుంది? - ఒకవేళ, చెబుదామన్నా వినిపించుకోవయ్యే. వెనకటికి నీ లాంటిదే ఓ కాంతమ్మ ఏం చేసిందో తెలుసా....''

''ఏం చేసిందీ?''

''ఏం చేసిందో వాళ్ళాయన మాటల్లోనే చెబుతాను విను-'' ఒక రోజున రాకరాక పరిషత్ పత్రిక వచ్చింది. ఎంతో ఆదుర్దాగా చదివి కాంతం కూడా చదవాలె ఇందులో విజ్ఞాన విషయాలు చాలా వున్నవని సరదాపడి పరుగు పరుగున యింటికి వచ్చి - వంట చేస్తున్న కాంతంతో - ఇదిగో. పరిషత్ పత్రిక వచ్చింది. మంచి విషయాలున్నవి అని చేతికిస్తే నేనటు తిర్గ్గానే ఆ పత్రికను చారు రాచిప్ప మీద మూతపెట్టింది-''.

ఆనందం మాటలు పూర్తి కాకుండానే హాసిని కలకలమంటూ, కిలకిలమంటూ గలగలా నవ్వేసింది - ''అదండీ హాస్యమంటే-'' అంటూ.

''చాల్లే నవ్వు... నువ్వు నవ్వుతున్నావు కాని ఆ కాంతం అలా చేసినందుకు వాళ్ళాయన చాలా విచారపడ్డాడుట.''

"'ఎందుకండీ విచారం? - పత్రిక అంత చక్కగా ఉపయోగపడ్డందుకు సంతోషించక: అయినా నాకు తెలియక అడుగుతా కాని....''

''నువ్వు తెలియక ఎందుకు అడుగుతావులే, తెలిసే అడుగుతావు. సరే అడుగు...''
''హాస్య రసము ఆంధ్ర వాఙ్మయమున జాలగొలదిగా గాననగుచున్నది - అని ఓ కవిగారన్నారు కదా నిజమేనాండి?''

''నిజమయితే కావచ్చుకాని - నిక్కమయిన నీల మొక్కటయినను జాలు తళుకు బెళుకు రాళ్ళు తట్టెడేల - అని యింకో కవిగారన్లేదా? చిక్కని హాస్యం కొంచెమయినా శతాబ్దాల తరబడి నవ్వించదూ? - అందుకేగా - వాహనంబు నెక్కవచ్చి భయంబున వడకి నేల బడ్డ వనజ గర్భు గమిచికొని మరాళకము వారె చెందమ్మి గరచికొని రయమున బరచినట్లు - అన్న పద్యం వింటే యిప్పటికీ మనకు నవ్వొరావటం లేదూ?...''

ఎక్కడిదా పద్యం...ఏమా కథ - అని మళ్ళీ హాసిని అడగకుండానే ఆనందం ఆ సందర్భం వివరించి చెప్పాడు-

## దేవతల పాట్లు, నవ్వుల మెట్లు:

''ఇది దక్షయజ్ఞ విధ్వంస సందర్భంగా దేవతలు పడ్డ పాట్లను కళ్ళకు కట్టినట్లు వర్ణించిన వైనం. శివశక్తులు విజృంభించి దక్షుని యజ్ఞవాటికలో ప్రవేశించగానే వారి రౌద్రాకారాలను చూసి చుట్టపుచూపుగా యజ్ఞం చూడటానికి వచ్చిన దేవతలంతా గజగజా వణికి పోతారు. ఎవరిదోవనవారు పారిపోవటానికి ప్రయత్నిస్తారు. ఎంతయినా పెద్దవాడు కాబట్టి బ్రహ్మదేవుడే ముందు దోవ చూపుతూ గజగజలాడుతూ పరిగెత్తి హంస దగ్గరకు వెళ్ళి దానినెక్కబోయి కిందపడిపోతాడు. హంసే సమయస్ఫూర్తితో ప్రవర్తించి ఎర్రకలువ పూవును నోటకరుచుకున్నట్లు బ్రహ్మగారిని ముక్కుతో పట్టుకొని ఎగిరి వెళ్ళి యజమానిని ఆపదనుండి కాపాడుతుంది. ఇతర దేవతలు కూడా యిలాగే నానాపాట్లూ పడతారు. డబ్బున్నవాడు మిగతావారి మీద ఎక్కి స్వారీ చేయటం యీ నాటికీ వున్నదే కదా.. అందుకే కుబేరుడు ఆనాడే మనుష్యుణ్ణే తన వాహనంగా చేసుకున్నాడు. అలాంటి కుబేరుడు కూడా యీ ఆపత్సమయంలో అసలు విషయం మరిచి తనెక్కి వచ్చిన మానవుణ్ణే తన భుజాలమీదకు ఎక్కించుకొని వణుక్కుంటూ పారిపోయాట్ట. ఎంతయినా డబ్బుకంటె ప్రాణమే ఎక్కువ కదా. మొత్తంమీద నన్నెచోడ మహాకవి రాసిన కుమార సంభవంలో యిలా దేవతలు పడ్డ పాట్లు నవ్వుల మెట్లుగా భాసించి ఎంతటి హాస్యాన్నయినా అందిస్తాయి - అర్థం చేసుకుని ఆస్వాదించ కలగాలి కాని...''

## ఛాందసుల పరాచికాలు:

ఆనందం ఉపన్యాసానికి కాదు కాని దేవతల పాట్లు తలుచుకుంటే హాసినికి నవ్వొచ్చింది. నవ్వుతూనే - ''అయినా మీదంతా చాదస్తం కాని యిప్పుడా పాత పురాణాలన్నీ ఎవరు చదువుతారండీ?-'' అంది.

"చాదస్తం అన్నావా? - అసలు ఛాందసుల ప్రవర్తన ఎంత హాస్యస్ఫోరకంగా వుంటుందో కూడా మనవారు వెనకే వర్ణించారు. యజ్ఞ యాగాదులు చేసి పుణ్యం మూటలు గట్టుకున్న ముసలయ్యలు రంభా, ఊర్వశులను గురించి కలలు కంటూ స్వర్గలోకం చేరుకున్నారు. అయితే - అప్సరసలు యీ అయ్యలను ఆట పట్టిస్తూ ఎప్పుడు ఇంద్ర దర్బారుకు జారిపోదామా అని ప్రయత్నిస్తూ

వుంటారు. ఆ సమయంలో - ''సోమయాగ ఫలంబు సుదతి నీకిచ్చేను మొగమిషు ద్రిప్పవే ముద్దుగాను-'' అంటూ ఓ స్వామి ఓ అప్సరస వెంటపడితే - ''వాజపేయ ఫలంబు వలదోషే యోష యింద్రుడేమిచ్చేని యిషు నిలవవె-'' అంటూ మరో వృద్ధ వరుడు యింకో భామ వెంటపడతాడు. "మేము శుంఠల మషే మీరు నేర్చినపాటి యెరుగ మషే వేదమెల్ల జదివి-'' అంటూ ఇంకో ఆయన వాదానికి దిగుతాడు. ఇటువంటి చాదస్తపు రాయుళ్ళ సంభాషణలూ అప్పటి అప్సరసల కులుకులూ తలుచుకుంటే ఎంత నవ్వొస్తుందో తెలుసా?-''

''తెలియదండీ..''

''తెలుసుకోవాలంటే అహల్యా సంక్రందనం చదువు-''

''చాల్లేండి! యిదా మీరిచ్చే సలహా - అహల్యా సంక్రందనమూ, తారా శశాంకమూ చదవమనా-'' అంటూ రుసరుసలాడింది హాసిని.

## పెద్దనగారి సరసోక్తి:

''పోనీ, మనుచరిత్ర చదువు. అందులో మాత్రం సరసాలకేం తక్కువ అనుకున్నావా?- ఈపద్యం గుర్తుందా - నునుచిగురాకు మేయుతరి నోరి కెలంకుల దేటి గుట్టినన్-''

''ఏమిటో? - ఆడకోయిల వయ్యారంగా లేత మామిడి చిగుళ్ళను తింటుంటే ఎక్కడో పూలలో దాక్కున్న తేనెటీగ ఝుంమంటూ వచ్చి దాన్ని కుట్టిందా?...''

''మరే. అలా దేటికుట్టదా - ఎంతయినా కోకిలమ్మ కాబట్టి శ్రావ్యంగా ఏడుస్తుంటే మగకోయిలవచ్చి ఓదార్చే నెపంతో - నాత్మముఖంబున ముఖంబు చేర్చి చుంబన మొనరించె...-''

ఆ మాటలు వింటూనే ఫక్కుమంది హాసిని- "అందుకేగా పెద్దనగారు... సందు సుడి మాయలుగా మగవారి కృత్యముల్... అని సరసోక్తి విసిరిందీ-'' అని కూడా అంది.

ఇంతలో బయటనుంచి రాగాలాపన వినిపించింది. రాగంతోపాటే ఆనందం 'బ్రదరిన్లా' పరమేశం లోపలికొచ్చాడు.

''ఏమివాయ్ మైడియర్ బ్రదరిన్లా ఎప్పుడొచ్చావు?-'' అని ఆనందం యింకా అడగకుండానే అతనే అందుకున్నాడు.

''బావా ఎప్పుడొచ్చితీవు? సుఖులే భ్రాతల్ చుట్టముల్ - అని నీవడగవని నాకు తెలుసు - చెల్లియో, చెల్లకో నాకు చేసిన యెగ్గులు మరిచి నేనే వచ్చేశాను! అన్నట్లు ఏమిటో తీవ్రంగా చర్చిస్తున్నట్లున్నారే -'' అన్నాడు.

''మరేం లేదు. కూర్చో కాఫీ తెస్తాను-'' అని లేవబోయింది హాసిని.

''ఏమిటోయ్ ఉద్యోగంలో చేరావా?- మొత్తంమీద లక్షణమైన ఉద్యోగం దొరికింది-'' అన్నాడు ఆనందం.

''లేదు బావా.. యింకా చేరకుండానే ఉద్యోగంలో నుంచి నన్ను ఊడపీకేశారు-'' అన్నాడు పరమేశం దిగులుగా.

''అదేం?-'' అన్నారు హాసినీ, ఆనందం యిద్దరూ ఒక్కసారే యుగళంగా.

''నీకు తెలుసుగా నాకు అపాయింట్‌మెంట్ ఆర్డరే గడ్డు అమావాశ్య నాడు వచ్చింది. అందిన రెండురోజులలోగా వచ్చి చేరమని అందులో రాశారు. ఆ మర్నాడు, ఆ తరువాతి రోజు కూడా

మంచివికావయ్యో - ఎలా వెళ్ళాను? - తిథివార నక్షత్రాలన్నీ కలిసిన మంచిరోజు చూసుకొని వెళితే ఆఫీసు గుమ్మంముందే నల్లపిల్లిలా బంట్రోతొకడు ఎదురయి చావు కబురు చల్లగా చెప్పాడు. అన్నవేళకు నేను రాలేదని ఆ ఉద్యోగం మరొకరికి యిచ్చేశారుట-'' అన్నాడు పరమేశం ఏడుపు మొగం పెట్టుకొని.

## వీరేశలింగంగారి బాణీ:

''మొత్తం మీద వీరేశలింగంగారి పాపయ్య పంతులుగారిలాగా చేశావన్నమాట -'' అన్నాడు ఆనందం. పోనీలే పోతే పోయిందిలే వెధవ ఉద్యోగం. ఏదన్నా వ్యాపారాన్ని మించిన మార్గం లేదనుకో-'' అన్నాడు ఆనందం.

''ఏం వ్యాపారం పెట్టను బావా?'' అన్నాడు పరమేశం ఆశగా.

''ఏదయినా ఫరవాలేదు. అసలు వ్యాపారం ఏదయినా జోరుగా ప్రచారం చేసుకుంటే చాలు డబ్బు కుప్పతెప్పలుగా వస్తుందనుకో. మూడొంతుల వ్యాపారాభివృద్ధి ప్రచారం మీదే ఆధారపడి వుంటుంది. కావాలంటే వెనక చిదంబరం గారనే ఆయన నడిపిన సిసింద్రీ పత్రికలోని ప్రకటనలను చూసి జనానికి కిర్రెక్కించే విధంగా ఎలా ప్రచారం చేసుకోవచ్చో తెలుసుకో-''

ఉదాహరణకు ఓ దర్జీ ఆ పత్రికలోతన కుట్టు నాణ్యతను గురించి యీ విధంగా ప్రకటించుకున్నాడు-

''కేవలమూ అందముగా మాచేత కుట్టబడిన దుస్తులతోనే ఎవరినయిననూ బహు ఘరానా మనిషిగానూ, అందగానిగానూ చేయుచున్నాము. వేయేల మేము కుట్టిన దుస్తులను ధరించి యింటికి పోయినచో మీ భార్యారత్నము సహితమూ మిమ్ములను ఎక్కువగా లవ్ చేయును. అలా లవ్ చేయటానికి కారణం మేము కుట్టిన అందమైన దుస్తులవల్ల ఆమె మిమ్ములను గుర్తింపకుండుటయే అని కూడా ఘంటాపథముగా చెప్పగలము-''

''చూశావా వారు కుట్టిన దుస్తులవల్ల మొగుణ్ణి కూడా గుర్తించలేక ఎవరో అనుకొని భార్యరత్నాలు మిక్కిలీ 'లవ్' చేస్తారట. ఇంత తెలివిగా నువ్వూ ప్రకటనలు గుమ్మరించగలిగితే ఏ వ్యాపారం పెట్టినా యిట్టె నెగ్గుకొచ్చేస్తావు-'' అని సలహా యిచ్చాడు ఆనందం.

''నయమే మంచి సలహాయే యిచ్చారు. ఒరేయ్ అలానే చేసేవు. వెనకటికి కామమ్మ మొగుడిలాగా అవుతుంది నీ పరిస్థితి. ఆ సంగతీ సందర్భమూ ఏమిటో మునిమాణిక్యం నరసింహారావుగారే ఒకసారిలా చెప్పుకొచ్చారు-''

## కామమ్మ మొగుడి కథ:

కామమ్మ మొగుడు భార్యా విధేయుడని అందరికీ తెలుసు. అందరూ అతన్ని చివాట్లేస్తూ వుండేవారు- నీ కర్మ ఏం కాలిందిరా ఆవిడ చెప్పిందానికల్లా గంగిరెద్దుల్లాగా తలూపటానికి? నీకు వ్యక్తిత్వం లేదా? చెప్పేసెయ్యి మీ ఆవిడతో యిక నీ పప్పులుడకవని చెప్పరా ధైర్యం తెచ్చుకొని- అన్నారు. కామమ్మ మొగుడు ఆరాత్రే చెప్పటానికి నిశ్చయించుకున్నాడు. చెప్పాడు కూడాను. స్నేహితులతన్ని ఎంతగానో మెచ్చుకున్నారు. భేష్- బానిసత్వంలో నుంచి విముక్తుడవయినావు. ఇక నీవు పదిమందిలో తలెత్తుకు తిరగవచ్చునన్నారు. కామమ్మ మొగుడు సిగ్గుపడుతూ మెల్లిగా తలవంచుకునే అన్నాడు-'' ఇంకా పదిరోజులు పోవాలే-'' అని. ఏం అన్నారు స్నేహితులు

ఆశ్చర్యంతో తలమీది గాయం మానటానికి పదిరోజులయినా పట్టదా- అన్నాట్ట కామమ్మ మొగుడు తల తడుముకుంటూ-

''ఆయన మాటలు వినేవు నీపనీ అలాగే అవుతుంది-'' అంది హాసిని.

ఇంతలో దొడ్లోనుంచి పెద్ద పెద్ద అరుపులూ కేకలూ వినిపించాయి. రెండు కంఠాలూ ఆడవాళ్ళవే. కిటికీలోనుంచి చూడగా ఆ యింటి ఓనరమ్మా పక్కవాటాలో అద్దెకుంటున్నావిడా పేచీపడి కట్లపాముల్లాగా లుంగలు చుట్టుకొని దొడ్లోబడి తిట్టుకుంటున్నారు. ఆ గలభాచూసి పరమేశం పాపం యింకా పెళ్ళన్నా కాలేదేమో బిక్కమొగం పెట్టాడు.

## అద్దెకొంపల భాగోతం:

''అలా బిక్కపోతావేంరా? భమిడిపాటివారు చెప్పినట్లు బాడుగ కొంపల్లో యిటువంటి భాగోతాలు మామూలే. అందులో మా కొంపలోలా నాల్గైదు వాటాలవారు ఒకే యింట్లో వుంటూ వుంటే యిహ వేరే చెప్పక్కర్లేదు. ఇలాంటి అవస్థే భమిడిపాటి కామేశ్వరరావుగారు సృష్టించిన ఒక వాటా ఆయనకు తటస్థించింది-

ఒకసారి రాత్రి ఎనిమిదిగంటల వేళ ఆయన లంకాదహనం చేస్తూ అరుగు మీద కూర్చొని వుండగానే రెండోవాటా ఆవిడవచ్చి ఊరంత పులిస్తరాకుల మోపుతెచ్చి మొదటివాటాకి ఎదురుగుండా దిబ్బున గిరవాటెట్టింది. దానికి ఆయన- చెట్టంత మనిషిని యిక్కడుండగానే ఏమిటమ్మా ఆపనీ- అన్నాట్ట. ఆవిడ- ఏంలేదండీ మాయింట్లో భోయినాలు అయినాయి. పులిస్తరాకులు- అని జవాబిచ్చిందిట. ఆ మాట నాకూ తెలుసు మా వేపునేనా మీరు వెయ్యవలసిందీ- అన్నాడాయన. మాకు మైలగదా మరీ మావేపున ఎలా వేసుగోడం మైల నిస్తళ్ళా- అంటూ ఆవిడ దీర్ఘాలు తీసిందిట. అంతేకాక గొల్లున రాగాలెట్టి రెండోవాటా వచ్చినాడు ఆడవాళ్ళ వ్యాపారాలలోకి జొరబడి తన ఘోషా చెడగొట్టి అనవచ్చినమాటా అనరాని మాటా అని నానాగోలా చేశాడని ఆవిడ నానాగోలా చేసి అందర్నీ పోగేసింది. అద్దె కొంపలలో వుండేటప్పుడు యిలాటి గొడవలు ఎలానూ తప్పవు కాని వుండు కాఫీ తెస్తాను-'' అంటూ లేచింది హాసిని.

''ఎప్పుడు పడితే అప్పుడు కప్పెడు కాఫీ యిచ్చు కాంత వుండిన గృహమే కదా స్వర్గసీమా-'' అంటూ దీర్ఘాలు తీశాడు ఆనందం.

''చాలించండి మీ పేరడీలు-'' అంటూ విసుక్కొంది హాసిని.

## పెద్దనగారి పద్యానికే పేరడీ

''ఎలిజీల సంగతి ఏమోకాని పెద్దనగారి ఓ పద్యాన్ని ఓ కవి ఎలా అనుకరించాడో తెలుసా?- ఓ ధూర్త గురువుగారు దేశ సంచారం చేస్తూ అంతకంటె ధూర్తుడయిన ఓ రాజుగారి దగ్గరకు వచ్చాడు. గురువుగార్ని చూసిన రాజుగారు- ఏయే వేశ్యగణంబు నారసితి రేయే శిష్యులం దిట్టినా రేయే కొంపలయందు జిచ్చిడితి రేయే చెర్వులం బూడ్చినారు- అంటూ కుశల ప్రశ్నలు ప్రారంభించి- ఏయే దారులం కంపగొట్టితిరి యేయే తోటలం బీకినా రాయా దుష్ట విదుష్ట చేష్టలను భ్రష్టా నాకు జెప్పంగదే- అంటూ వేడుకున్నాట్ట-''

ఆ పద్యం వింటూనే హాసినీ పరమేశం కూడా ఫక్కున నవ్వేశారు-

''ఇలా నవ్వుతూ కూర్చుంటే ఎన్నయినా చెబుతారు- కాఫీ తెస్తాను వుండండి-'' అంటూ వంటింట్లోకి వెళ్ళింది హాసిని.

''అవును నిజమే తెలుగు సాహిత్య హాస్య వినీల గగనంలో ఎన్నని తళుకు చుక్కలను ఏరగలం?-'' అన్నాడు ఆనందం- ఆ జ్ఞాపకాల మెరుపుతో మొహం అంతా వెలిగిపోతుంటే!

# నీ కొడుకు – నీ కూతురు

– ఆర్.వి.జి. సుందరరావు

నీ శిశువుయొక్క ప్రథమావస్థ సంయోగం చెందిన గ్రుడ్డు. ఆ స్థితి నుంచి ఎర్రటి పెదవులూ, మిలమిల మెరిసే కళ్లూ, ముక్కూ, చెవులూ, లేతకిసలయాల్లాంటి చేతులూ, కాళ్లూ ఉండి, నువ్వనుక్షణం ముద్దులాడే నీ శిశువు ఏవిధంగా వృద్ధిపొందుతుందో, ఆలోగా ఏయే అవస్థలు, రూపవైచిత్రాలని పొందుతారో తెలుసుకుందామిప్పుడు.

సంయోగమైన నాటి నుంచీ గ్రుడ్డు భిన్నించడం ప్రారంభమవుతుంది. ''ఓవిడక్టు'' లో ఉన్నప్పుడే అది రెండు భిన్నాలవుతుంది. ఆ రెండూ చెరి ఒక రెండు భిన్నాలవుతాయి. ఈ విధంగా, భిన్నాలయిన భాగాలు పూర్తిగా విడిపోకుండా మాత్రం ఒకే సమూహంగా ఉంటూ, అనేకమార్లు విభజించుకుని, ఓవిడక్టులో నుంచి గర్భాశయంలోనికి వచ్చేటప్పటికి కొన్నివందల కణసమూహంగా తయారవుతుంది. దీన్ని "Segmentation" అంటారు. ఓవిడక్టు నుంచి గర్భాశయానికి చేసే ప్రయాణం సుమారు వారం రోజులు పడుతుంది. అంతేకాదు– ఆ సమూహంలోనే కణాలు వేరువేరు గుంపులుగా చేరి ఒక నిర్ణీతమైన పద్ధతిలో అమర్చబడి ఉంటాయి. ఇప్పటివరకూ గ్రుడ్డుకు ఆహారం గ్రుడ్డులోనే ఉంటుంది. అందు చేతనే గ్రుడ్డు తక్కిన కణాలకంటె చాలా పెద్దదిగా ఉంటుంది.

అది గర్భాశయంలోనికి రాగానే తల్లి గర్భాశయంలో ఓ మూల దొల్చుకుని, అందులో సురక్షితంగా గూడు కట్టుకున్నట్టు ఉంటుంది. అప్పటి నుంచీ గ్రుడ్డు తన ఆహారానికి తల్లిమీద ఆధారపడుతుంది. గ్రుడ్డు చుట్టూ ఆహారపదార్థాలతో ఉన్న తల్లి రక్తం ప్రవహిస్తూ ఉంటుంది. కనుక ఆ రక్తంలో నుంచి తనకి కావలసిన ఆహారం తీసుకుని వృద్ధిపొందడం, బరువు హెచ్చడం ప్రారంభించుతుంది.

కాని– మొదటి కొద్దిరోజులలోనూ భావి అవయవాలేమీ జనించవు. రెండోవారం చివరికి నీ శిశువు సుమారు ఒక మిల్లీమీటరంత పరిమాణం కలిగి ఉంటుంది. అంటే– ఆ స్థితిలోనే ఉన్న నీ శిశువులాంటి వారిని 25 గురిని దగ్గరగా పేర్చితే ఒక అంగుళం పొడవు నాక్రమిస్తారన్నమాట!!

మూడోవారంలో నీ శిశువు త్వరగా వృద్ధిపొందుతుంది. అవయవాలూ, దేహంలో ముఖ్యమైన అంగాలూ సూచించబడతాయి నాటికి. అయిదో వారం అయ్యేసరికల్లా గుండెకాయా, కాళ్లూ చేతులూ ఉండవలసిన చోట మొటిమల్లా ఉండే ప్రథమావస్థరూపంలో ఉన్న అంగాలూ, అన్నరసనాళం యింకా యితర భాగాలూ కూడా తయారవుతయి. కాని– ఇన్నీ ఉన్న ఆనాటి నీ శిశువు పరిమాణం మాత్రం అంగుళంలో అయిదవవంతే! ఈ చిన్న పరిమాణంలోనే నీ భావి పుత్రుడో, పుత్రికకో ఉండవలసిన లక్షణాలూ, అంగాలూ ఉంటాయన్నమాట.

కాని– నీ శిశువు ఆ దశలో విచిత్రమైన స్వరూపంలో ఉంటుంది. బాహ్య ప్రపంచంలోనికి వచ్చినప్పుడెంత అందంగా ఉండి, నీకు ఆనందాన్నిచ్చేటట్టుంటుందో, అంతకు రెండు రెట్లు అసహ్యంగా భీభత్సంగా, అందవికారంగా ఉంటుంది. 5 వారాలప్పుడు, కోతికిమల్లే ఒక చిన్నతోక, వికృతమైన శరీరానికి సరిపోనంత తలకాయ, ముక్కడిలా తయారులో ఉన్న మొద్దుముక్కూ, రెండు గుంటల్లా ఉండే కళ్లూ ఉన్న నీ శిశువుని నువ్వాస్థితిలో చూస్తే, ఆశ్చర్యం, అసహ్యం కూడా కలుగుతాయేమో!! మరో చిత్రం– చిన్నప్పటి నీ శిశువు కంఠం చూస్తే నీ శిశువుని ఏదో ఒక చేప

అనుకుంటావు. అచ్చు చేపకుండే ఊపిరి తిత్తులకుమల్లే, కంఠంమీద నాలుగు జతల కన్నాలుంటాయి. కాని ఇవే కొద్దికాలంలో చెవులూ, చెవిలో ఉండే ఇతరభాగాలూ అవుతాయంటే ప్రకృతిలోని శిశువుకి మొదట ఈ మత్స్యావతారం ఎందుకు అనిపిస్తుంది. కోతిపిల్లలాంటి తోక యెందుకని కోపం వస్తుంది.

కాని– నీ భావవాహిని ఏమైనా, ఈ చిహ్నాలకి అపారమైన అర్థం, వీటివల్ల మనకు ప్రకృతిలో అన్నింటికంటే విచిత్రమైన జీవరహస్యాన్ని తెలుసుకొనే కీలకం ఇమిడి ఉన్నాయి. వీటిని గురించి మరోమారు తెలుసుకుందాం!

అది అట్లా ఉంచి తిరిగి నీ శిశువు వద్దకు వద్దాం. పరిపూర్ణమైన మానవ శిశువు గుండెకాయలో నాలుగు గదులుంటాయి. కాని ఆ స్థితిలో ఉన్న నీ శిశువుకు చేపకుమల్లే రెండే గదులున్న గుండెకాయ ఉంటుంది. ఇదీ– 'అనేక' అనే చిహ్నాలనీ పరిశీలిస్తే నీ శిశువుకీ చేపకూ ఏదో సన్నిహిత సంబంధమున్నట్టు తెలుతుంది. మరో విషయం– ఈ ప్రథమావస్థలో ఉన్న నీ శిశువు పిండానికీ (embryo) చేప, బల్లి, చెవులపిల్లి, కోతి, కోడి మొదలైనవాటి పిండాలకీ రూపంలో ఏమీ అట్టే భేదముండదు. అన్నీ ఇంచుమించు ఒక్కలాగే ఉంటాయి. మరీ ప్రథమావస్థలో అసలు భేదమే కనపడదు. దీని అర్థం కూడా మరోమారు తెలుసుకుందాం.

రెండో నెలలో నీ శిశువు మరికొంత మార్పుచెంది మానవ స్వరూపం పొందుతుంది. ఈ నాటికి ఆ శిశువు ఒక అంగుళం మాత్రం ఉంటుంది!! ఈ అంగుళం పొడుగు శిశువులో అప్పుడే చేతులూ, చేతులకు వ్రేళ్లూ, వ్రేళ్ళకి గోళ్లూ అన్నీ ఏర్పడతాయి. తోకకూడా దాదాపు అదృశ్యమౌతుంది. కాని మెదడు మాత్రం ఇంకా చాలావరకు పెరుగవలసి ఉంటుంది. ముఖమింకా అందవికారంగా భీభత్సంగానే ఉంటుంది. అయినా మానవ స్వరూపానికి కావలసిన ముఖ్య చిహ్నాలన్నీ అప్పటికి ఏర్పడి ఉంటాయి.

కనుక, ఈ రెండు నెలల్లోనూ ఒక చిన్న గ్రుడ్డు నుంచి అతిత్వరగా నీ కొడుకో నీ కూతురో వృద్ధిపొందుతారన్నమాట. శిల్పి అందమైన బొమ్మని చెక్కేముందు చిత్తుబొమ్మని తరువాత సావకాశంగా నగిషీలు చెక్కినట్టే మిగిలిన ఏడునెలలలోనూ ప్రకృతి వికృతాకారంలోనున్న నీ శిశువు రూపాన్ని మారుస్తుంది. మిగిలిన ఈ కాలంలో ఇంతకన్నా పెద్దమార్పులేమీ రావు. ఒక అంగుళం పరిమాణంలో నుంచి సాధారణ మానవశిశువు సైజులోనికి పెరగడమూ, ముఖాన్నీ, మిగిలిన భాగాల్నీ, అంతరాంగాల్నీ (internal organs) పూర్తిగా మానవ రూపంలోనికి తీసుకురావడమే ఇకముందుపని.

ఇప్పుడు తల్లిగర్భంలో ఉన్న నీ శిశువు ఆ తొమ్మిది నెలలోనూ ఏ విధంగా ఊపిరి పీలుస్తుందో, ఆహారం తీసుకుంటుందో కొద్దిగా తెలుసుకుందాం. నీ శిశువులో తయారయే అంతరాంగాల్లో మొట్టమొదటిది గుండెకాయ. ఇది పిండావస్థలో మొదటినెలలోనే జనించి తరువాత మానవుడు పెరిగి, పెద్దవాడై, ముదుసలై దీర్ఘసమాధిలోకి పోయే అంతిమ క్షణం వరకూ విసుగూ విరామం లేకుండా పనిచేస్తుంది. మొదటి అవస్థలోనే రక్తప్రసార నిర్మాణం (Circulatory system) కూడా ఏర్పడుతుంది. దీనికీ తల్లికీ మధ్య ఒక తాత్కాలిక సంబంధం కూడా ఏర్పడుతుంది. అదే నీ శిశువుకి ఉండే ''బొడ్డు''. ఈ బొడ్డు గురించి ఇంకా తెలుసుకునే ముందు నీకు సాధారణంగా తెలియని ఒక విషయం– తల్లి గర్భంలో ఉన్నంతకాలం శిశువు తన ఊపిరితిత్తుల నుపయోగించి ఊపిరి పీల్చటం జరగదు!! ఊపిరి తీయటం అని మనం సాధారణంగా వ్యవహరించే వ్యవస్థే ఉండదు. అసలు ఆ కాలంలో శిశువు ఊపిరితిత్తులు ముడుచుకొనిపోయి ఉంటాయి. శిశువు సరాసరి భూపతనమైన వెంటనే

మొదటిమారు కెవ్వుమని ఏడ్చినప్పుడు ఆ ఊపిరితిత్తులు విడి ఆ క్షణం నుంచే పనిచేస్తాయి. అందుకోసమే, పుట్టగానే పిల్ల ఏడవకపోతే నాయనమ్మో మరో ముసలమ్మో పిర్రమీద ఒకటి తగల్నిచ్చి ఏడిపిస్తారు.

ఇక– శిశువు బాహ్యప్రపంచంలోనికి రాగానే మనకుమల్లే ఎందుకూ పనికిరాని బొడ్డు కాకుండా ఆ బొడ్డు మొదలుపెట్టుకొని ఒక పెద్ద రబ్బరుగొట్టం లాంటి గొట్టం ఉండడం నీకు తెలిసి ఉండాలి. జననమైన వెంటనే దానికి మరేమీ ఉపయోగం లేదు కనుక దానిని కత్తిరించేస్తారు. కాని తల్లిగర్భంలో ఉన్నంతకాలం ఆ గొట్టమే శిశువుకి తల్లి నుంచి ఆహారం, ప్రాణవాయువుల్ని తీసుకువస్తుంది. ఆ గొట్టానికి రెండోచివర ''ప్లెసెంటా'' అన్న పదార్థం ఉంటుంది. ఈ భాగంలో తల్లీపిల్లలరక్తాల కలయిక జరుగుతుంది. ఆ కలయికలోనే తల్లి రక్తంలో నుంచి ఆహారం ప్రాణవాయువుల్ని తీసుకుని, తనలోని చెత్తపదార్థాలని తల్లిరక్తాని కందించుతుంది. కనుక గర్భాంతరావస్థలో ఈ ''ప్లెసెంటా'' యే నీ శిశువుకి ఊపిరితిత్తులుగా, ప్రేగులుగా, మూత్రపిండాలుగా వర్తిస్తుందన్నమాట. భూపతనమైన క్షణం నుంచీ శిశువు తనంతతాను స్వయంగా పోషించుకోవటం, ఊపిరితియ్యటం, జీర్ణించుకోవటం మొదలయిన కర్మలన్నిటినీ ప్రారంభిస్తుంది.

ప్రస్తుతం ఒక అతిముఖ్య విషయం మాత్రం తెలుసుకుని ఆపుదాం. భూపతనమయినంత వరకూ, ఆ తరవాత కూడా చాలాకాలం వరకూ మానవశిశువు అన్ని విషయాలకీ తన తల్లిమీద ఆధారపడ వలసిన అసహాయస్థితిలో ఉంటుందని తెలుసుకున్నావు. ముఖ్యంగా తన ఆహారానికీ, ప్రాణవాయువుకీ గర్భాంతరావస్థలో తల్లి తప్ప వేరే గత్యంతరం లేదు. కనుక గర్భవతి అయిన నీ భార్య ఆ పరిస్థితులలో ఒక మహోన్నతమూ, అతి క్లిష్టమూ, బాధ్యతాయుతమూ అయిన జీవకార్యాన్ని నిర్వహిస్తున్నదన్నమాట. భావిజీవితంలో నీ శిశువు యొక్క ఆరోగ్యం, దారుఢ్యం, ఇవన్నీ కూడా చాలావరకూ ఈ తొమ్మిది నెలల మీదే ఆధారపడి ఉన్నాయన్నమాట. తల్లి శిశువుకిచ్చే ఆహారంలో మానవుడికి కావలసిన ప్రధానపదార్థాలు తక్కువైతే జనించిన శిశువు బలహీనంగా, రోగాశ్రయంగా అవుతుంది. కనుక మామూలు పరిస్థితులలోకన్నా యిప్పుడు నీ భార్య గురించి, ముఖ్యంగా ఆమె నెరవేర్చవలసిన మహోన్నత బాధ్యతను గురించీ, ఆమె ఆహారం, పరిశుభ్రమైన గాలీ విషయాల్లో నీవు తీసుకోవలసిన జాగ్రత్త చాలా ఉంది. అనుక్షణం నువ్వు అప్రమత్తుడుగా సంచరించాలి. లేకపోతే నీ భార్య పట్లా, భావిజీవితం పట్లా కూడా, చాలా దుర్మార్గంగా, తెలివి తక్కువగా ప్రవర్తించేవన్నమాట.

ఈ విధంగా తల్లిగర్భంలో తొమ్మిది నెలలూ పెరిగిన తర్వాత నీ కొడుకో, నీ కూతురో బాహ్యలోకంలోనికి అవతరిస్తుంది. అప్పటినుంచీ జీవనాటకంలో అనేకపాత్రలు ధరిస్తూ, జీవశక్తికి తోడుపడుతూ, తన కార్యాలని (జీవశాస్త్రానికి సంబంధించినంతవరకూ) ఎలా నిర్వర్తిస్తుందో మరోమారు తెలుసుకుందాం.

**లోగడ ఇదే సంపాదకత్వం 1948లో వెలువడిన**
**'జ్యోతి' పత్రిక నుండి పునర్ముద్రణ.**

# ఆచార్య నాగార్జున మధ్యమక కారిక

– ఎమ్. రాజగోపాలరావు

ఆంధ్రుల ముద్దు బిడ్డగా పరిగణించుకొనే ఆచార్య నాగార్జునుని గురించి ఆంధ్రులంతగా పట్టించుకోరు. అందరూ ఎరుగుదుమనుకొనే వ్యక్తిని గురించి అంతగా పట్టించుకోకపోవటం లోకరీతి. ఆ పేరును చిరస్మరణీయం జేసుకోవటం ఆత్మగౌరవంగా భావించు కొంటారు. అందుకే ఆధునికాంధ్రలో నాగార్జున సాగరం, నాగార్జున విశ్వవిద్యాలయమేకాక ఆ పేరుతో ఎన్నో సంస్థలు వ్యవస్థలు ఏర్పడ్డాయి. అయితే, నాగార్జునుని భావనా సాగరాన్ని బౌద్ధ మతం విశ్వవ్యాప్తం చేయటానికి కృషిచేసింది. నాగార్జునుని అజరుని అమరుని చేసింది. ఆ కృషి ఫలితంగానే నాగార్జునుని చింతనా వ్యక్తిత్వం మన కందుబాటులోకి వస్తున్నది.

అంతటి ప్రసిద్ధి చెందిన ఆచార్యుని రచనలుగా అనేక గ్రంథాలు ప్రచారంలో వుండటంలో ఆశ్చర్యం లేదు. అవి అన్నీ భారత దేశంలో లభించకపోయినా చైనా, టిబెట్ దేశాలలో వారి భాషలలో లభ్యమవుతున్నాయి. వాటి నుంచి వాటి పూర్వ రూపాన్ని పునరుద్ధరిస్తున్నారు. ఇప్పటికే కొన్ని ఆంగ్లంలో ఇతర భారతీయ భాషలలో వెలువడ్డాయి. సాగుతున్న అవిరళ కృషివల్ల అన్నీ కొన్నేళ్లలో ఏదో ఒక భారతీయ భాషలో అందికలోకి రాగలవనే ఆశ కలుగుతున్నది.

కుమార జీవుడు నాగార్జునుని జీవిత చరిత్ర రచించాడు. అదిప్పుడు చైనా భాషలో లభ్యమవుతున్నది. నాగార్జునుని గ్రంథాలను కుమార జీవుడు అయిదు వర్గాలుగా విభజించాడు. కొన్ని విమర్శనాగ్రంథాలు, కొన్ని వివరణ గ్రంథాలు, కొన్ని వ్యాఖ్యాన గ్రంథాలు, కొన్ని భక్తి స్తోత్రాలు, కొన్ని లేఖా గ్రంథాలున్నాయి. అవన్నీ నాగార్జునుడివి అయినా కాకపోయినా మహాయాన బౌద్ధ స్వభావ అవగాహనకు - ముఖ్యంగా మాధ్యమిక దర్శన అవగాహనకు అవి ఎంతగానో ఉపకరిస్తాయి. వాటిలో ఆరు కృతులను అత్యంత ప్రముఖాలుగా పరిగణిస్తారు. (1) మూల మధ్యమకకారిక, (2) శూన్యతాసప్తతి, (3) విగ్రహవ్యావర్తని, (4) వైదల్యసూత్రం (5) వైదల్యప్రకరణం (6) వ్యవహార సిద్ధి.

వీటిలో మొదటి గ్రంథానికి ఎంతో ప్రాధాన్యమున్నది. భారతీయ దర్శన పరిణామంలో అది ఒక మైలురాయిగా నిలిచిపోతుంది. దానితోనే నాగార్జునుడు కారికారచనకు శ్రీకారం చుట్టాడు. అదే బౌద్ధ ధర్మాన్ని పునర్ వ్యాఖ్యానించి పురాతన పునాదులమీద పునః ప్రతిష్ఠించి శాఖోపశాఖలుగా విస్తరించిన బౌద్ధంలో తామరతంపరగా పెరిగి పోతున్న వాదవివాదాలతో, పెరిగిపోతున్న నూతన సిద్ధాంతాలతో మరుగైపోతున్న బుద్ధ హృదయాన్ని పునఃప్రతిష్ఠితం జేసింది. అదే వేదాంతాన్ని ప్రభావితంజేసి అద్వైత వేదాంతానికి బీజావాపనం జేసింది. అటు తరువాత అభివృద్ధి చెందిన భారతీయ దర్శన మంతటికీ అది గీటురాయి అయింది. అంతేకాకుండా అది ప్రపంచ దర్శనాన్ని - మహాయాన ప్రపంచ దర్శనాన్ని - ఎంతగానో ప్రభావితం జేసింది. దానిపేరుతో చైనా, జపాన్ దేశాలలో కొన్ని శాఖ లేర్పడటం దాని విశిష్టతకు అద్దం పడుతుంది. చైనా, జపాన్, టిబెట్, నేపాల్, భూటాన్ దేశాలు ఆచార్యుని ఆరాధిస్తాయి; ఆచార్యుని గ్రంథాలను పారాయణం చేస్తాయి. ఆచార్యుని జీవనంతో ముడిబడి ఉన్న ధాన్యకటక, శ్రీపర్వతాలను పవిత్ర యాత్రాస్థలాలుగా కీర్తిస్తాయి. వారి ఆదరం వల్లనే నాగార్జునుని సమగ్ర స్వరూపాన్ని ఆవిష్కరించుకొనే అదృష్టం లభిస్తున్నది.

ఆనాడు ప్రచారంలో ఉన్న అనేక తీవ్రవాదాల అయోమయం నుండి ప్రజలను తప్పించే మార్గం కోసం బుద్ధుడన్వేషించాడు. అస్తిత్వ-నాస్తిత్వాలు; శాశ్వత-ఉచ్ఛేదాలు, అంత-అనంతాలు; జీవ-అజీవాలుగా రకరకాలుగా అన్నిటినీ వర్గీకరించి, వివరించి, యథార్థాన్ని అందించలేని వాదాలవల్ల ప్రయోజనంలేదని గ్రహించాడు. అవిరళకృషిచేసి సత్యాన్ని సందర్శించి అంతా దుఃఖం, అనిత్యం, అనాత్మ అని బోధించి, అష్టాంగ మార్గాన్ని నిర్దేశించి పదార్థ యథార్థతా ప్రతిపాదకంగా ప్రతీత్య సముత్పాదాన్ని ప్రతిష్ఠించి మధ్యేమార్గాన్ని అనుసరిస్తూ మధ్యమ ప్రతిపత్తిని ఉద్బోధించాడు. బుద్ధ వచనాన్ని విశ్లేషించి బౌద్ధ ధర్మాన్ని వివరించే ప్రయత్నంలో బయలుదేరిన అర్థ కథలు, విభాషలు, అభిధర్మాలు- వాటి ఆధారంగా బయలుదేరిన వాదాలు, వివాదాలు బౌద్ధ ధర్మాన్ని అగమ్య గోచరం చేసి బుద్ధుని మధ్యమ ప్రతిపత్తికి భంగం కలిగించే సిద్ధాంతాల నభివృద్ధిచేసి అవే బుద్ధ వచనసారాలుగా వ్యాఖ్యానించాయి. ఆ అస్తవ్యస్త పరిస్థితి నుంచి బౌద్ధ ధర్మాన్ని రక్షించే బాధ్యతను నాగార్జునుడు స్వీకరించాడు. అందువల్లనే ఆచార్యుడు రెండో బుద్ధుడుగా గౌరవమందుకొన్నాడు. ఆ ప్రయత్న ఫలితమే మధ్యమక కారిక. దానినే మధ్యమక శాస్త్రం, మూల మాధ్యమికకారిక, - అంటూ రకరకాలుగా పిలుచుకొన్నారు. 'కారిక' అంటే 'సూత్రాది వివరణ శ్లోకములు' అన్న అర్థం నిఘంటువుల్లో ఉంది.

మధ్యమక కారికలో 27 ప్రకరణాలున్నాయి, 448 కారికలున్నాయి. ప్రతి ప్రకరణమూ ఆనాడ బౌద్ధ, బౌద్ధేతర వర్గాలలో అత్యంత చర్చనీయమయిన అంశాన్ని పరీక్షిస్తుంది. ప్రత్యయాలు, ధాతువులు, ఆయతనాలు, ఉపాదాన-ఉపాదాత్రాలు; అగ్ని-ఇంధనాలు; సంసారం, దుఃఖం, సంస్కారాలు, సంసర్గం, స్వభావం, బంధం, కర్మ, ఆత్మ, కాలం, సామగ్రి, సంభవ-విభవాలు, తథాగత, విపర్యాసాలు, ఆర్యసత్యాలు, నిర్వాణం, ద్వాదశాంగాలు, దృష్టివాదాలను సమ్యక్ దృష్టితో పరీక్షించి పూర్వాపరాంశాలతో అనుసంధించి, సంబంధాలను నిష్కర్షించి అవి అన్నీ ప్రతీత్యసముత్పన్నాల నీ నామలక్షణ వికల్ప మాత్రాలనీ స్వభావ శూన్యాలనీ మధ్యమక కారిక వివరిస్తుంది. అన్నీ స్వభావ శూన్యాలనటంవల్ల అది శూన్య వాదంగా ప్రసిద్ధి చెందింది. అస్తిత్వ-నాస్తిత్వాలకు మధ్యమ ప్రతిపత్తిగా ప్రతీత్య సముత్పాదాన్ని వివరించటం వల్ల మాధ్యమిక వాదమయింది. నాగార్జునుని స్వభావ శూన్యతనే శూన్యతగా పరిగణించిన ప్రత్యర్థులు దానిని పరమ శూన్యతగా వివరించి విమర్శించారు.

అయితే ప్రపంచాన్నీ, ప్రపంచ పదార్థాలనూ, ప్రపంచ అనుభవాలనూ ఆచార్యుడు తిరస్కరించాడు. వాటిని ఆత్మాశ్రయాలుగా మాత్రమే అంగీకరిస్తాడు. వాటిని సంవృత సత్యాలు-వ్యావహారిక సత్యాలు అంటాడు. అవి వ్యావహారిక జీవనానికి ఉపకరిస్తాయి. ఎవరి మానసిక శారీరక పరిమితుల కనుగుణంగా వారు వాటిని గ్రహించుకొంటారు. అవి వారి వారి ఊహామాత్రాలే అవుతాయి. వైకల్పికాలే అవుతాయి. అందువల్లనే రకరకాల వ్యక్తులు వాటిని రకరకాలుగా గ్రహిస్తుంటారు. వారి వారి అభిలాషలకు, ప్రయోజనాలకు అనుగుణంగా వాటిని మలుచుకో గలుగుతారు.

అంతకు మించిన సార్వత్రిక యథార్థతను గ్రహించటం సామాన్యులకు సాధ్యంగాదు. విశిష్ట కృషిజేసి సామాన్య విజ్ఞతను అధిగమించి ప్రజ్ఞాపారమితను స్వాయత్తం జేసుకొన్నవారికే ఆ అతీశ - అంటే అనుభవాతీత-యథార్థమందుతుంది. దానినే పరమార్థ సత్యమంటాడు నాగార్జునుడు. ఆ పరమార్థ సత్యాన్ని అందుకొన్నప్పుడు వ్యావహారిక సత్య స్వభావ శూన్యత

అర్థమవుతుందంటాడు. ఆ స్వభావ శూన్య-వ్యావహారిక సత్యంలోనే ఆ పరమార్థం నిక్షిప్తమయి ఉంటుంది. అందువల్ల వ్యావహారిక సత్యం ద్వారానే పారమార్థిక సత్యాన్ని దర్శించవలసి ఉంటుందంటాడు ఆచార్యుడు. ఆవిధంగా నాగార్జునుడు సామాన్య విజ్ఞత-శాస్త్రీయ విజ్ఞానాలమధ్య నుండే విభేదాన్ని, సమైక్యతను కూడా ప్రదర్శిస్తాడు. అదే బౌద్ధ ధర్మ సారాంశమంటాడు.

ఈ ప్రయత్నంలో నాగార్జునుడు సాంప్రదాయిక బౌద్ధసాహిత్యానికి భిన్నమయిన ప్రజ్ఞా పారమిత గ్రంథాలను ప్రమాణాలుగా గ్రహించాడు. వాటిని దక్షిణాదిన నాగలోకంలో మహా నాగుల వద్ద సంపాదించానంటాడు ఆచార్యుడు. ఆ ప్రజ్ఞా పారమితలలో పురాతనమయిన 'అష్టసాహస్రిక ప్రజ్ఞాపారమితసూత్రం' ధాన్యకటక మహాచైత్య సమీపంలో కృష్ణాతీరంలో అభివృద్ధి చెందటం నాగార్జునుడు ఆంధ్రుడనటానికి ప్రత్యక్ష నిదర్శనమవుతుంది. అంతేకాక బుద్ధుడు పరినిర్వాణమందిన రెండు వందల సంవత్సరాల తరవాత అశోకుని ఆదరణలో పాటలీపుత్రంలో అశోకారామంలో మొగ్గలిపుత్తతిస్స ఆధ్వర్యంలో జరిగిన తృతీయ సంగీతిలో సంకలనం జేసిన పాళీ పిటకాలకుముందే బౌద్ధం ఆంధ్రదేశం చేరి కృష్ణాతీరం తాకి ధాన్యకటకం కేంద్రంగా విస్తృతమయి సంస్కృతంలో ప్రజ్ఞాపారమిత గ్రంథాల రూపంలో ప్రతిష్ఠం గావటం బుద్ధుడు స్వయంగా ఆంధ్రదేశంలో విహరించాడనే ఐతిహ్యాన్ని బలపరుస్తుంది.

ఆచార్య నాగార్జునుని కృషివల్లనే బౌద్ధ ధర్మం నూతన వ్యాఖ్యానంతో పరిపుష్టమయింది. మహాయానం సువ్యవస్థితమయింది. భిక్షుగతమయిపోయి సమాజానికి దూరంగా ఆరామాలలో, విహారాలలో, శాలలలో, వనాలలో, వనాంతరాలలో తలదాచుకొన్న బౌద్ధ ధర్మం అందరికీ అందుబాటులోకి వచ్చి సర్వాచరణీయ ధర్మంగా రూపొంది సర్వజనామోదం పొంది, ప్రపంచ పరివ్యాప్తం కాగలిగింది.

(వచ్చే సంచిక నుంచి 'మధ్యమక కారిక' తెలుగు అనువాదం వ్యాఖ్యానంతో ప్రకటించటం జరుగుతుందని తెలియబరచటానికి సంతోషిస్తున్నాము- సంపాదకుడు).

'కారిక' అంటే 'వ్యాఖ్యానం'

## Steps to Stress - proof your body

### Put purpose into your life

We all need purpose in our lives. We need something to hope for, something to fight for and something to look forward to. Without purpose and meaning your life will be hollow and unrewarding. Purpose and ambition will enable you to live through the worst of life's crisis. Begin putting purpose into your life by making a list of all the goals and ambitions you had when you were a teenager. Try to think back and remember what hopes and aspirations fired your imagination at that age. Then take a look through your list to see just how many of those dreams and ambitions still excite you. You'll probably realize that a number of your old dreams are still within reach.

# వాస్తు శిల్పం

– డా. సంజీవ్ దేవ్

పక్షికి గూడు, జంతువుకు గుహ, మనిషికి గృహం. ఆదిమ మానవుడికి గుహయే గృహం. ఆనాటి గుహ నేటి గృహంగా రూపొందటంలో ప్రపంచంలోని గృహ నిర్మాణకళలో ఎన్నెన్నో మార్పులు వచ్చాయి. గృహ నిర్మాణకళనే వాస్తుశిల్పం అంటారు. స్థాపత్యం అనికూడ మరో పేరుంది దీనికి.

ఎండాకాలపు ఎండ, వర్షాకాలపు వర్షం, చలికాలపు చలి ప్రతిప్రాణినీ బాధిస్తాయి; మనిషిని ఇంకా ఎక్కువ. కారణం, మనిషికి మిగతా ప్రాణులవలె శరీరంమీద రోమాలు మొదలైన సహజ రక్షణ సామగ్రి లేదుకనుక.

అందుకే మిగతా ప్రాణులకంటే మనిషికి వాతావరణ నుంచి రక్షణావసరం ఎక్కువైంది. చలిదేశాల్లో ఎండ ఇంటిలోకి ఎక్కువగా ప్రవేశించే పద్ధతిలో గృహ నిర్మాణాలు జరిగితే ఉష్ణదేశాల్లో ఎండనుండి కాపాడుకొనే పద్ధతిలో జరుగుతూ వచ్చాయి.

ఆదిమ మానవుడు గుహా వాసాన్ని వదలిన తరువాత వెదుళ్ళూ ఆకులూ, గడ్డీ సహాయంతో కుటీరాలను, లేక గుడిసెలను నిర్మించుకోసాగేడు. అవి ఎండకూ, వానకూ, చలికీ మంచుకూ రక్షణలు అయాయేకాని అగ్నిభయం నుండి రక్షణ లేకుండా పోయింది.

ఆనాడు ఆదిమానవుడు నిర్మించుకొన్న మాదిరి కుటీరాలు నేటికీ ప్రపంచం అంతటా అక్కడక్కడ నిర్మించ బడుతూనే వున్నాయి, ప్రత్యేకించి మన దేశంలో ఎక్కువగా. నాటి కుటీరాలు నేటికీ కట్టబడుతున్నాయికాని నేటిసౌధాలు నాడులేవు. నేడుకూడ నాటి ఆదిమవాసులున్నారుకాని నేటినాగరికులు నాడులేరు!

వాస్తుశిల్పం మిగతా కళలన్నిటికీ తల్లి. చిత్రకళ, శిల్పకళ అన్నీకూడ ఇల్లు అనేది లేంది సృష్టించబడేవి కావు. చిత్రం, శిల్పం అన్నీకూడ గృహాలంకరణ నిమిత్తమే ప్రథమంలో సృష్టించబడేవి. ఆదిమ చిత్రకళకూడ ఆదిమవాసుల గుహల్లోని గోడలపైనే మొదటిగా చిత్రించబడినాయి. నేడు శిల్పాలు ఇంటితో సంబంధం లేకుండా బహిరంగ స్థలాల్లోవుంచబడుతున్నా కూడ చిత్రాలను మాత్రం ఇంటిగోడలకు తగిలించక తప్పదు.

చిత్రం లేకపోయినా, శిల్పం లేకపోయినా మనిషి జీవించగలడు కానివాస్తులేంది జీవించ జాలడు. ఇల్లులేంది చెట్లక్రింద మాత్రం ఎంతకాలం జీవిస్తాడు మనిషి? ఎండా కాలంలో మాత్రమే మనిషిని కాపాడుతాయి చెట్లు, వర్షాకాలంలో, చలికాలంలో కాపాడలేవు. అందుకే, మనిషికి తిండీ, బట్టా అయినతరువాత ప్రధానవసరం ఇల్లు.

చిత్రాన్ని ముందువైపునుండి మాత్రమే చూడగలం; శిల్పాన్ని ముందూ చూడగలం, చుట్టూ తిరిగికూడ చూడగలం; వాస్తుకృతిని ముందుచూడగలం, చుట్టూ తిరిగి చూడగలం, అంతేకాక దానిలోపలికికూడ ప్రవేశించగలం. అసలు వాస్తు నిర్మాణం జరిగేది దాన్ని బయటనుండి చూడటానికి కాకలోపలికి ప్రవేశించటానికే.

చాలా వస్తువులన్నీ శూన్యంతో కప్పబడివుంటాయి. అంటే ఒక రాయివున్నదీ అంటే దాని చుట్టూ శూన్యప్రదేశమే ఆనుకొని వుంటుంది. కాని ఇల్లు అటువంటిది కాదు. ఇంటిని శూన్యం కప్పివున్నట్లే శూన్యాన్నికూడ ఇల్లు కప్పివుంటుంది. ఇంటి బయటి భాగం అంతాశూన్యం. ఇంటిలోపలిభాగం కూడ శూన్యం. బయటి శూన్యానికీ లోపలిశూన్యానికీ మధ్య వుంటుంది ఇల్లు. అంటే వాస్తు నిర్మాణం రెండురకాల శూన్యాలను కలిగివుంటుంది తన బయటి శూన్యం, తనలోపలి శూన్యం ---.

మన భూమిమీది బలమైన కొన్ని శక్తుల్లో భూమ్యాకర్షణ (gravitation) ఒకటి. భూమిమీదనుండి పైకి లేవాలనే ప్రతి వస్తువునూ భూమ్యాకర్షణ క్రిందికిలాగుతుంది. రాయినిపైకి ఆకాశంలోకి విసరితే విసరిన బలంవున్నంత వరకు పైకిపోతుంది కాని ఆబలంతగ్గగానే తిరిగి భూమ్యాకర్షణశక్తికి లోబడి పైనుండి క్రిందికి భూమిమీద పడుతుంది.

వాస్తుశిల్పం, లేక గృహ నిర్మాణం ప్రధానంగా భూమ్యాకర్షణతో పోరాడి విజయం పొందటమే, ఇంటికప్పు క్రిందపడాలని ప్రయత్నిస్తుంటే గోడలుకాని స్థంభాలుకాని దాన్ని క్రింద పడకుండా వుంచాలని పోరాడుతుంటాయి, ఈ రెండు పోరాటాలు రాజీపడి (neutralised) ఒక స్థిరత్వాన్ని సృష్టిస్తాయి. కప్పు పడిపోకుండావుండటం, గోడలు దానిని పడనీయకుండా వుండటం.

వాస్తుశిల్పం అంటే అడ్డమూ (horizontal) నిలువు (vertical) ల అనుమేళన. ఇందుకు ప్రధాన సామగ్రి దూలమూ స్తంభమూ (lintel and column). దూలంశక్తీ, స్తంభంశక్తీ సమబలంతోవుండాలి. దూలం బలమైంది అయినపుడు దాన్ని మోయకలిగిన బలమైందిగా వుండాలి స్తంభం. స్తంభం బలమైంది అయి దానిమీద దూలం బలహీనమైంది అయితే ఆ దూలం మీద పడే బరువును దూలం మోయలేదు. దూలాన్నిమోయకలిగి వుండాలి స్తంభం, దూలం తనమీది బరువును మోయకలిగివుండాలి. దూలం స్థానంలో గోడవున్నా అంతే. గృహనిర్మాణంలో స్తంభాలభాగాన్ని ఎక్కువగాగోడ ఆక్రమించింది.

గోడలేకుండా స్తంభాలతో మాత్రమే గృహనిర్మాణం జరిగితే వాతావరణ ప్రభావాలనుండీ రక్షణ వుండదు. దొంగలనుండీ రక్షణవుండదు. గోడలేనపుడు ఇంటిలోపలి వస్తువులన్నీ బయటికి కనపడుతుంటాయి. వాకిలిపెట్టి తలుపులు పెట్టి తాళం పెట్టుకొనే వీలుండదు గోడలేని స్తంభాల ఇంటికి. కనుకనే, వరాండాలలాంటి చోట్లలో తప్ప, ఇంటి మధ్యలో కొన్ని చోట్ల తప్ప స్తంభాల స్తానాన్ని గోడలే ఆక్రమించాయి.

గోడలకు వాకిళ్లూ, కిటికీలూ వుంచినపుడు ఇంటిపై కప్పును మోయటానికి గోడకు కొంత బలహీనత ఏర్పడుతుంది. దీన్ని నివారించటానికి వాకిలిమీదా, కిటికీ మీదా రాతిబండనో, కొయ్యముక్కనో వేసి దానిమీద తిరిగి గోడకట్టటం జరుగుతుంది. దానితో వాకిళ్లూ కిటికీలూ వున్నాకూడ కప్పుక్రింద నిలచివుండే గోడకు తగినంత బలం ఏర్పడుతుంది.

వాకిలిమీదా, కిటికీమీద ఇటువంటి దూలం లాంటి ఏర్పాటుకు బదులు ఆర్చీ లాగటంకూడ జరుగుతుంటుంది. మొదటి దానికంటే ఈ రెండవ పద్ధతే గృహ నిర్మాణంలో ఎక్కువగా జరుగుతూ వచ్చింది. ఏది ఏమైనా వాస్తుశిల్పంలో ప్రధానభాగాలు కప్పు, దాన్నిమోసే గోడకానీ స్తంభాలుకానీ. ఈ రెంటికీ సామరస్యాన్ని సృష్టించటంలో వాస్తుశిల్పి విఫలుడైనాడా అంటే కట్టిన గృహం కూలిపోతుంది. ఆ ఆపదను కలగకుండా చూడటం వాస్తుశిల్పికి మొదటి కర్తవ్యం.

ప్రపంచం అంతా రాతిభూమికాదు, మట్టి భూమికూడా ఎంతగానోవున్నది. అన్నిస్థలాల్లో పర్వతాలుండవు. అందుకని వాస్తుశాస్త్రజ్ఞులు ప్రపంచాన్ని రెండు భాగాలుగా విభజించారు రాయిదొరికే ప్రదేశమనీ, దొరకని ప్రదేశమనీ ---

రాయిదొరికే ప్రదేశంలో రాతితో గృహ నిర్మాణాలు జరిగితే, రాయిదొరకని ప్రాంతాల్లో మట్టితో తయారుచేసిన పచ్చి ఇటుకతోనో, కాల్చిన పండు ఇటుకతోనో కట్టడాలు నిర్మించబడేయి.

ప్రతి పని యొక్క నిర్మాణశైలీ అది నిర్మించబడే సామగ్రిమీద కూడ చాలా భాగం ఆధారపడివుంటుంది. కొయ్యతో కట్టే నిర్మాణాలు ఒక విధంగా వుంటే, రాతితో నిర్మించేయి ఇంకో

విధంగా వుంటాయి, ఇటుకతో కట్టేవి మరో విధంగా వుంటాయి. ఉపయోగించే సామగ్రి కట్టడపు శైలిని నిర్ణయిస్తుంది.

పక్కాకట్టడాల నిర్మాణానికి సున్నం అవసరం. రాతి కట్టడాల్లో, ఇటుక కట్టడాల్లో కూడ సున్నానికి బదులు మట్టి పెట్టి కట్టేయి కూడా వుంటాయి. కాని ఈ రెంటి కట్టుబడిలో కూడ సున్నం ఉపయోగిస్తేమాత్రమే ఎక్కువ బలిష్ఠంగా, ఎక్కువ కాలంపాటు వుంటాయి. సున్నంతో కట్టుబడి అతిప్రాచీన కాలంనుండీ కూడ వాడుకలో వుండి వున్నది.

'సుధ' అంటే సున్నం, సుధతో కట్టబడిన నిర్మాణం 'సౌధం'. సున్నంతోకాక మరో దానితో కట్ట బడినట్టి ఎంత బృహత్ భవనం కూడ సౌధంకాదు. ఆ కట్టడంలో సుధ(సున్నం) లేనప్పుడు అది సౌధం ఏవిధంగా అవుతుంది?

అయితే, పూర్వకాలపు కోటలు మొదలైన కొన్ని నిర్మాణాలను సున్నంబదులు ఒక ప్రత్యేకంగా తయారు చేసిన పాటిమట్టితో నిర్మించేవాళ్లు. అటువంటి ప్రత్యేకమైన మట్టితో కట్టిన కట్టడాలు సున్నంతో కట్టిన కట్టడాలకంటే ఎక్కువ బలీయంగా వున్నట్టు రుజువు అయినాయి. అదొక ప్రత్యేక ఉదాహరణ. మామూలు మట్టితో రాయిపెట్టికాని, ఇటుకపెట్టికాని కట్టినవి సున్నంతో రాయిపెట్టికాని ఇటుకపెట్టికాని కట్టిన వాటికంటే బలహీనంగా వుంటాయి, సందేహంలేదు.

కొంతకాలం క్రిందటివరకు ప్రతిదేశానికీ దాని స్వంత వాస్తుశైలి వుండేది కాని ఆధునిక కాలంలో అటువంటి దేశీయ విశిష్టతలు పోయి ఒక విశ్వజనీన వాస్తుశైలి ప్రపంచం అంతా వ్యాపించింది. దీన్ని 'ఆధునికరీతి' అని మాత్రమే అంటారు ఏదేశంలో నైనా దీని నిర్మాణం సున్నం, రాయి, లేక ఇటుక మొదలైన సాంప్రదాయిక సామగ్రితో కాక కాంక్రీటు, లోహం, ఈ రెంటితో జరుగుతుంది.

సాంప్రదాయకంగా పాశ్చాత్య వాస్తుశిల్పంలో ప్రధానంగా రెండు విధాలు వాడుకలో వున్నాయి. ఒకదాన్ని 'ట్రెబీటెడ్' (Trabeated) రీతి అనీ, రెండవదాన్ని 'ఆర్క్యుయేటెడ్' (Arcuated) రీతి అనీ అంటారు. మొదటిది బాగారాయి లభ్యమయే ఈజిప్టు, పర్షియా, గ్రీసు మొదలైన దేశాలకు చెందివుంటే రెండవది రోం, బైజంతియం, ఇంకా ఉత్తర ఐరోపా మొదలైన వాటికి చెందివుంది; దీన్ని గోథిక్‌శైలి అని కూడ అంటారు.

ట్రెబీటెడ్ రీతి, స్తంభం, దూలం పద్ధతి నిర్మాణానికి చెందింది. అందుకే ఈ రీతి రాయిదొరికే దేశాల్లో వాడుకలోవున్నది. నేడువాడుకలో వున్న లోహంకాంక్రీటు నిర్మాణం రీతికి కూడ దారితీసింది ఇది.

రెండవది అయిన ఆర్క్యు యేటెడ్ రీతి ఆర్చినిర్మాణ పద్ధతిలో భవన నిర్మాణం చేస్తుంది. రాయిదొరకని, ఇటుకవాడుకలో వున్న దేశాల్లో, గోథిక్ చర్చినిర్మాణాలు ప్రధానంగా ఈ రీతిలో జరుగుతూవచ్చాయి.

రాయి అరుదుగా మాత్రమే లభించే మెస్పటోమియాలో కాల్చని పచ్చి ఇటుకతో మాత్రమే ఆర్చీల రీతిలో కట్టడాలు కడితే గ్రీసులో రాతితో మాత్రమే స్తంభం దూలం పద్ధతిలో కట్టడాలుకట్టేవారు. మెస్పటోమియాలో ట్రెబీటెడ్ రీతిని కాని, గ్రీసులో ఆర్క్యుయేటెడ్ రీతినికాని అనుసరించేవారు కారు.

కాని ఈజిప్టులో మాత్రం ఈ రెండు పద్ధతులూ కూడ వాడుకలో వుండేయి. మతంతో సంబంధంలేని లౌకిక నిర్మాణాలన్నీ ఆర్క్యుయేటెడ్ రీతిలో ఇటుకతో తయారయేయి; మత సంబంధమైనవి, మరణ సంబంధమైన సమాధులలాంటివి విరివిగా ట్రెబీటెడ్ రీతిలో రాతితో తయారయేవి. గ్రీకులకు కూడ ఈ రెండు నిర్మాణరీతులతో పరిచయంవున్నా కూడ వారు ఇష్టపూర్తిగా రెండవ రీతిని వదలి మొదటి

రీతినే అవలంబించారు. రెండవ దానికంటే మొదటిది ఎక్కువ హుందాగా, గంభీరంగా, స్థిరంగా గోచరిస్తుంది.

రోమన్లు ఆర్క్యుయేటెడ్ రీతిని కాంక్రీట్‌తో కూడ నిర్మించేవారు. ఆర్చీల ఖాళీలతో, పైన గుంబజాల (dome) నిర్మాణాలతో రోమనులు 140 అడుగుల ఎత్తు కట్టడాలను కూడ నిర్మించారు. గ్రీకులకు పొడవూవెడల్పులు ప్రధానమైతే రోమన్లకు ఎత్తూలోతులు ప్రధానం.

వాస్తు నిర్మాణాలను రూపొందించటంలో ఆయాదేశాల్లో లభించే సామగ్రికితోడు అక్కడి వాతావరణం, ప్రజల ఆచారవ్యవహారాలు, సామాజిక వ్యవస్థ, ఆర్థిక పరిస్థితులు మొదలైన వాటి ఎన్నిటి ప్రభావమో వుంటుంది. కనుకనే ప్రాచీనకట్టడాలను ఆధారం చేసుకొని ఆయా దేశాల చరిత్రలను తెలుసుకొనే అవకాశంవుంది.

నిర్మించిన భవనం దానిలో నివసించేవారి జీవితాలమీద ఎంతో ప్రభావాన్ని వేస్తుంది. మనిషి నిర్మిస్తాడు గృహాన్ని, తిరిగి గృహం నిర్మిస్తుంది మనిషిని. ఇంటి ముందరి ప్రాంగణాన్ని బట్టీ, ఇంటివెనకున్న పెరటిని బట్టీ, ఇంటిలోపలిభాగాన్నిబట్టీ, ఇంటి విశాలత్వాన్నీ, సంకీర్ణతనుబట్టీ, ఇంకా ఎన్నో ఇటువంటి విశేషాలనుబట్టీ ఇంటిలోని నివాసుల మనస్తత్వాలు మారుతుంటాయి. అందుకే మానవ జీవితంలోని ప్రధాన భాగాల్లో ప్రధానమైంది ఇల్లు. చుట్టూవున్న పరిసరాల ప్రభావం ఇంటిమీద ప్రసరిస్తే ఇంటి ప్రభావం ఇంటివారి మీద ప్రసరిస్తుంది. అంటే, ఇంటివారి జీవితాలు ఇంటితో ఎంతగానో సంబద్ధాలు!

విశ్వజనీనమైన ఆధునిక వాస్తు నిర్మాణంలో వక్రరేఖలకంటే సరళరేఖలు ప్రధానం. అంటే కట్టడంలో వంపుల కంటే సూటిదనం ఎక్కువుంటుంది; వలయాకృతికంటే కోణాకృతికి ఎక్కువ ప్రాధాన్యం; అలంకరణల కంటే సాదాతనం అధికం; ఏటవాలు కప్పులు కాక సమతలమైన కప్పులు వుంటాయి; స్థలాన్ని ఆక్రమించటం కంటే ఆకాశాన్ని ఎక్కువగా ఆక్రమిస్తాయి.

ప్రతి కళాకూడ రెండు ప్రధాన దశలను కలిగి వుంటుంది, నిర్మాణాత్మకం (Structural), ప్రయోజనాత్మకం (Functional) అని. చిత్ర, శిల్ప, సంగీత, నృత్య మొదలైన కళలో నిర్మాణాత్మక దశ ప్రధానం అయితే వాస్తు శిల్పంలో ప్రయోజనాత్మక దశ ప్రధానం. ప్రాచీన వాస్తుశిల్పంలో నిర్మాణ కౌశలానికీ, నిత్య ప్రయోజనానికీ రెంటికీ కూడ ప్రాధాన్యం వుండేది. ఒక దాని నిమిత్తం మరొకటి ఆహుతి అయేది కాదు.

ఆధునిక వాస్తుశిల్పం నిర్మాణకౌశలాన్ని చిన్నచూపు చూస్తుందని కాదు కాని అవసరం అయితే ప్రయోజనం నిమిత్తం నిర్మాణకౌశలాన్ని నిర్లక్ష్యం చేస్తుంది. ఒక కట్టడ నిర్మాణంలో ఒక మూలలోని విస్తీర్ణాన్ని తగ్గిస్తేకాని ఆ కట్టడం సుందరంగా గోచరించదు అన్న సత్యం వ్యక్తమైనా కూడ ఆ విధంగా విస్తీర్ణాన్ని తగ్గించినందున ఇంటిలోని వారికి అసౌకర్యం ఏర్పడుతుంది అనే సత్యం కూడ సమానంగా వ్యక్తమైనపుడు సౌకర్యం నిమిత్తం నిర్మాణకౌశలాన్ని వదలటం జరుగుతుంది. అంటే, ఆధునిక వాస్తు నిర్మాణంలో ఉపయోగం ప్రథమం, సౌందర్యం రెండవది.

అందుకే, నిర్మాణంలోని ఎత్తుపల్లాలు, అలంకరణలు, వంపులు మొదలైన ఆధిక్యం వుంటే వాటిని శుభ్రపరచటం సులభం కాదు, మురికీ, బూజూ, దుమ్మూ ధూళీ ఎక్కడివక్కడే అతుక్కుపోతాయి. ఇటువంటి వాటి నుండి వాస్తు నిర్మాణాన్ని ముక్తపరిస్తే ఆ ఇబ్బందులు తక్కువవుతాయని.

ఇక భారతీయ వాస్తు విషయంలో ప్రవేశిస్తే అదొక అగాధం. అది ఎంత విస్తృతమైందో అంతలోతైంది కూడ. ఎంత ఉపయోగమైందో అంత సుందరమైంది కూడ. అంతమాత్రాన

ప్రపంచంలోని వాస్తు శిల్పాలన్నిటిలోకీ భారతీయ వాస్తు శిల్పం మాత్రమే మహోత్కృష్టమైందని అనజాలం కాని ప్రపంచంలోని మహోత్కృష్ట వాస్తుశిల్పాల్లో భారతదేశానిది కూడ ఒకటి అని అనగలం. ఒక్కొక్క దేశపు వాస్తు శిల్పానికి ఒక్కొక్క ప్రాధాన్యం వుంటుంది.

భారతీయ వాస్తుశిల్పం అటు 'ట్రెబీటెడ్' రీతికీ, ఇటు 'ఆర్క్యుయేటెడ్' రీతికీ కూడ సమన్వయం, ప్రత్యేకించి దేవాలయ నిర్మాణంలో. గోపురానికి క్రింద వున్న భాగమంతా, అంటే స్తంభాలూ దూలాలూ 'ట్రె బీటెడ్' రీతికి చెందితే గోపురం 'ఆర్క్యుయేటెడ్' రీతికి చెందుతుంది. దీని అర్థం ఈ రీతులను భారతీయ వాస్తుశిల్పులు అనుకరించారనికాదు. ఏ దేశపు శిల్పశాస్త్రాలు ఆ దేశానికే వున్నాయి. అనుకరణ వేరు, ఒకదాని ప్రభావం మరొకదానిపై పడటం వేరు. స్వతంత్ర సృజన లోపించినపుడు అనుకరణ చోటు చేసుకుంటుంది. పరస్పర దేశ ప్రభావాలు పడినందున సృజనలోని ప్రతిభకు నవ్యకాంతులు అబ్బుతాయి.

భారతీయ వాస్తుశిల్పంలో స్తంభ నిర్మాణానికి ప్రత్యేక ప్రాధాన్యం ఇవ్వబడింది; ప్రాచీన వాస్తుశాస్త్రమైన ''మానసార'' అనే గ్రంథంలో ఈ విషయమై విపులీకరణ వున్నది. అసలు స్థంభం అనే పేరుకే 12 పర్యాయ పదాలున్నాయి; జంఘ, చరణ, స్తలి, స్తంభ, అంఘ్రి, స్థాణు, స్థూణ, పాద, స్కంభ, అరణి, భార, ధారణ అనేవి.

భారతీయ వాస్తుశిల్పానికి సంబంధించిన శాస్త్ర గ్రంథాలలో ''కాశ్యపశిల్ప'', ''మానసార'', ''శిల్పరత్న'', ''సమరాంగణ'', ''అపరాజిత'' అనేవి ప్రధానాలు. వీటిల్లో వాస్తుశిల్పానికి సంబంధించేకాక అసలు, శిల్పానికి సంబంధించిన విషయాలు కూడ చాలా వుంటాయి. ''మానసార'' అనేది మాత్రం ప్రత్యేకంగా వాస్తుశాస్త్రం క్రిందకువస్తుంది, శిల్పం విషయం కొంతవున్నా కూడ.
భారతీయ వాస్తునిర్మాణం అనార్యుల కాలంలోనే ఉన్నతస్థాయిని అందుకొన్నట్లు దాఖలాలు కనిపిస్తున్నాయి. హరప్ప, మహంజదారో నాటి సింధునాగరికత రోజుల నాటికే రమ్యమైన భవనాలున్నాయట. ఆర్యులు భారతదేశంలో అడుగుపెట్టేనాటికే అనార్య నాగరికత పూర్ణంగా వికసించివుంది. భవన నిర్మాణాలు, రథనిర్మాణాలు, నగరినిర్మాణాలు అప్పటికే ఉన్నతస్థాయిలో వున్నట్లు తెలుస్తుంది. నూతనంగా వచ్చిన ఆర్యులకు ఈ కళలతో పరిచయం లేదట. వారిది కేవలం పుస్తకం చదువేనట.

కాని ఇటీవల ఈ అనార్య సిద్ధాంతం తలక్రిందులు చేయబడింది. సింధునాగరికత ఆర్యులదే కాని 'అనార్యులది కాదని నూతనంగా ఒక సిద్ధాంతాన్ని లేవతీశారు డాక్టర్ సి.యస్.రావు అనే ఒక పురాతత్వశాస్త్రవేత్త. అంతవరకెవరూ చదవజాలనట్టి సింధునాగరికతకు సంబంధించిన లిపిని ఆయన చదవకలిగేరట. దాని ఆధారంతో ఆయన ఈ నూతన సిద్ధాంతాన్ని లేవదీశారు. ఇది ఎంతవరకు నిలుస్తుందో నిదానం మీదట కాని తెలియదు.

ఇప్పటికి ఆరువేల సంవత్సరాలనాటి భారతీయ నాగరికత ఎవరిదైనప్పటికి అది గొప్ప నాగరికత అనటంలో సందేహం లేదు. ప్రతిభావంతులు అవునా, కాదా అనేది ముఖ్యం కాని వారు ఆర్యులా అనార్యులా అనేది అంత ముఖ్యం కాదు. ప్రతిభలేని ఆర్యులు కాని, అనార్యులు కాని మనకు మాన్యులు కారు, ప్రతిభ కనుక వుంటే వారు ఆర్యులయేది, అనార్యులయేది, మరింకెవ్వరైనా అయేది మనకు మాన్యులే. సింధునాగరికత వికసించివున్న నాటి వారు ప్రతిభావంతులు. కనుక వారెవ్వరైనప్పటికీ మనకు వంద్యులు, వారి వాస్తుకళ శిఖరాలనందుకొన్నది.

భారతీయవాస్తు శిల్పాన్ని ఆదిమ (Primitive) ప్రాగైతిహాసిక (Pre-historic), ప్రథమ ఐతిహాసిక (Proto-historical) ఐతిహాసిక (Historical) అనీ, హిందూ, బౌద్ధ, ముస్లిం, బ్రిటిష్,

స్వాతంత్ర్యానంతర అనీ విభజించవచ్చు. సింధునాగరికతకు చెందిన వాస్తునిర్మాణం ప్రథమ ఐతిహాసిక కాలానికి చెందుతుంది.

హిందూవాస్తుశిల్పం ఎంతో విస్తృతమైంది, ఎన్నెన్నో సూక్ష్మ వివరాలతో కూడుకొని వున్నది. ఒక కట్టడాన్ని నిర్మించాలంటే నిర్మాణానికంటే మించిన పనిని ముగించాలి నిర్మించటానికి ముందు. స్థలాన్ని ఎన్నుకోటంలో ఎన్నో ఆరోగ్య సూత్రాల్ని, వాతావరణ సూత్రాల్ని, నీరు లభ్యమయే సూత్రాల్ని, తోటలూ దొడ్లూ వేసుకొనే సూత్రాన్ని, ఈ విధంగా ఎన్నెన్నో సూత్రాల్ని అమలుపరచాలి.

గృహనిర్మాణం జరిగేది గృహంలో వుండే వారి నిమిత్తం కనుక వారి మనస్తత్వాలకూ నివాసపరిసర ప్రభావాలకూ సరిపోయేట్లు చూడాలి. దైవనిలయాలు, రాజప్రాసాదాలు నేలమీది కోటలు, కొండలమీది కోటలు, వర్తకుల గృహాలు, విద్యావంతుల గృహాలు, కళాకారుల గృహాలు, కళావంతుల గృహాలు, కార్మికుల గృహాలు, చిత్రశాలలు, నాట్యశాలలు, ఆశ్రమాలు మొదలైనవన్నీ ఏవిధంగా నిర్మించాలో అనే వివరాలను చూస్తే ఆశ్చర్యం వేస్తుంది.

గ్రామ నిర్మాణం, నగర నిర్మాణం, ఉద్యాననిర్మాణం, సరోవర నిర్మాణం మొదలైనవన్నీ వాస్తుశిల్పంలోనివే. ఏ ఋతువులో ఏ దిశ నుంచి గాలి తోలేదీ, ఏయే దిశలో ఎటువంటి ఆకారమైన కిటికీ వుండాలి, ఆ కిటికీకి ఏమి పేరుండాలి అనేది కూడా వాస్తుశిల్ప గ్రంథాల్లో వివరించబడి వుంది. ఒక్కొక్క కిటికీ (జాలకం) ఒక్కో రూపంలో వుంటుంది. దేనికది ప్రత్యేకమైన పేరుకలిగివుంటుంది. ఇవి ఆరువిధాలని ''కాశ్యపశిల్పం''లో పేర్కొనబడి వాటికి ఆరు పేర్లు కూడ ఇవ్వబడినాయి; గోనేత్ర, గజనేత్ర, నంద్యావర్త, ఋజుక్రియ, పుష్పకర్ణ , సకర్ణ అనేవి. ఇన్ని సూక్ష్మవివరాలతో కూడుకొన్న వివరణ అద్భుతంగా వుంటుంది!

ఒక్కో రూపంగల భవనానికి ఒకోపేరు: స్థానక, ఆసన, శయన, శుద్ధ, మిశ్ర, జాతి, ఛంద, వికల్ప, సంచిత, అసంచిత, అపసంచిత మొదలైనవి. మొత్తం మీద ఏ రకం కట్టడమైనప్పటికీ ఈ క్రింది మూడుజాతుల కట్టడాల్లో ఏ ఒకదానికైనా చెంది తీరుతుంది; 'నాగర' (ఉత్తరం), 'వేసర' (తూర్పు), 'ద్రావిడ' (దక్షిణం) అనేవి. ఉత్తరశైలిని దాని చతుష్కోణ ఆకృతిని బట్టి గుర్తించవచ్చు. తూర్పుశైలిని దాని పై భాగపు గుండ్రదనాన్ని బట్టీ, దక్షిణశైలిని దాని పై భాగపు ఎనిమిది పలకల రూపాన్ని బట్టీ తెలుసుకోవచ్చు.

ఈ అంతిమ ద్రావిడశైలిలో మరో ఉపభాగం ఉన్నది; దాన్ని ఆంధ్రశైలి అంటారు. దీనిపై భాగం ఆరు పలకలుగా వుంటుంది. శిల్పకళలో, చిత్రకళలో వున్నట్లుగానే వాస్తు శిల్పంలో కూడ ఆంధ్రశైలి అనేది అతిప్రాచీన కాలం నుండి వున్నట్లు తెలుస్తుంది.

ఈ విధంగా హిందూవాస్తు శిల్పం అనేకానేకమైన వివరాలను కలిగివున్నది. వాస్తుశాస్త్రాల్లో వున్నవాటన్నిటినీ స్థపతులు భూమి మీద నిర్మించారో లేదో తెలియదు. అదేవిధంగా భూమి మీద నిర్మించిన వాటన్నిటిని గురించి వాస్తుశాస్త్రాల్లో వివరించబడిందో లేదో కూడ తెలియదు. ఎప్పుడూ కూడ శాస్త్రం ముందు పుట్టి ఆచరణ తరువాత పుట్టదు. ఆచరణ ముందుపుట్టి శాస్త్రం తరువాత పుడుతుంది. ప్రారంభం ఆ విధంగా అయినా కూడ కొన్ని శాస్త్రాలు ఆచరణకు అందుబాటులో లేకుండా పోతాయి.

హిందూవాస్తుశిల్ప ఛ్ఛాయలోనే పెరిగిన బౌద్ధవాస్తు క్రమేణ తన స్వంతరూపాల్ని, రూపవిభాగాల్ని నిర్మించుకోసాగింది. బౌద్ధవాస్తు నిర్మాణాల్లో విహారం, చైత్యం, స్తూపం అనే మూడు ప్రధానాలు;

విహారం అంటే బౌద్ధ భిక్షులు నివసించే ఆరామం. చైత్యం బౌద్ధుల ఆరాధనా మందిరం. స్తూపం అనేది ఒక విధమైన సమాధి అని. బుద్ధుని అస్తికలను, ఇంకా ఇతర బౌద్ధ మహాపురుషుల అస్తికలను భూమిలో వుంచి వాటిమీద కట్టిన కట్టడాన్ని స్తూపం అంటారు.

ఆనాడు కట్టిన బౌద్ధ విహారాల్లో నేటి కట్టడాల్లో వున్నవాటికి పోలిన వసతులెన్నో వుండేయి. బౌద్ధ వాస్తు, దేశంలోని మైదానాల్లో మాత్రమే కాక కొండలను తొలిచి కూడ కట్టబడినాయి. కొండలను తొలిచి కట్టబడిన బౌద్ధ నిర్మాణాలు ఎక్కువగా పశ్చిమ భారతదేశంలో వున్నాయి, మధ్య భారతదేశంలో వున్నాయి.

విశ్వవిఖ్యాతిచెందిన అజంతా గుహలు అటువంటివే. ఈ గుహల్లో మూడు విధాలైన బౌద్ధ వాస్తునిర్మాణాలు గోచరిస్తాయి. బౌద్ధ బిక్షువుల నివాసాలైన విహారాలు, వారి ఆరాధనా మందిరాలైన చైత్యాలు, ఆ చైత్యాల్లోని స్తూపాలు. బీహార్‌లో క్రీ.శ. ఆరు, ఏడు శతాబ్దాల్లోని నలందా విహారాలు కూడ గొప్పగా వుండిపోయినాయి.

అయితే, బౌద్ధ నిర్మాణాల్లో స్తూపాలు ప్రత్యేక ఖ్యాతిని గడించాయి. వాటిలో ప్రత్యేకంగా సాంచీలోని, అమరావతి లోని స్తూపాలు విశేషకీర్తినార్జించాయి. అయితే, ఇందులో ఒక చిన్న మర్మం ఇమిడుంది. ఈ స్తూపాలకు అందిన ఖ్యాతికి అసలు కారణాలు ఆ స్తూపపు వాస్తు కౌశలం కాక దాని మీద చెక్కబడిన శిల్ప సౌందర్యం అనటంలో అసత్యం వుండబోదు. ఏమైనా, బౌద్ధ శిల్పకళ అందుకున్న ఖ్యాతిని బౌద్ధ వాస్తుశిల్పం అందుకోలేదు.

తరువాతి వాస్తుశిల్పంలో ముస్లిం వాస్తు ప్రధానమైంది. క్రీ.శ. పన్నెండో శతాబ్దపు అంతిమ దశాబ్దంలో గోరీ రాజు అయిన మహమ్మద్ బిన్ సామ్ ఢిల్లీనీ, దాని పరిసరాల్నీ జయించాడు. అప్పటి నుండి ఢిల్లీ అనేక పాలకుల చేతుల్లో మారింది. ఆ కాలంలో భారతదేశంలోని అన్ని చోట్లా ముస్లిం వాస్తుశిల్పం విరివిగా వికసించింది.

ముస్లిం వాస్తు శిల్పాన్ని స్థూలంగా నాలుగు కాలాలుగా విభజించవచ్చు: ఖిల్జీకాలం (1290-1320), తుగ్లక్ కాలం (1320-1412), సయీద్‌కాలం (1414-51), లోడీకాలం(1451-1526). తరువాత ఇది ప్రాంతీయశైలులుగా ఒకో ప్రాంతంలో ఒక్కోవిధంగా రూపొందింది. ముస్లిం వాస్తు నిర్మాణం లోని ప్రధాన లక్షణాలు గుంబజ్, మీనార్. గుండ్రని గుంబజాల, పొడవాటి స్థంభాలు, గోడల్లో జాలరీ నగిషీ.

ముస్లిం రాజ్య పతనానంతరం బ్రిటిష్ వారి పాలనలో అనేక విధాలైన పాశ్చాత్యశైలులు మనదేశంలో ప్రవేశించి అటువంటి కట్టడాలు లేచాయి. అప్పటికవి నూతనం, నేడవి పాతబడిపోయినాయి. ఆ నిర్మాణాలు ఏమాత్రం కళాకాంతీ లేకుండా చప్పగావుంటూ వచ్చాయి.

ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం భారతదేశపు స్వాతంత్ర్యానంతరం విశ్వజనీనమైన ఆధునికశైలి భారతీయ వాస్తుశిల్పంలో ప్రవేశించి కాంక్రీట్, లోహంతో ప్రతిచోటా ఎన్నో కట్టడాలు తలలెత్తేయి. ఈ ఆధునిక శైలిని గురించి ఇందులో ఒకచోట వివరించబడింది.

భూమికి గొడుగు ఆకాశం, మనిషికి గొడుగు ఇల్లు.

క్రింది భువినీ పైని దివినీ కలిపే శిల్పం వాస్తుశిల్పం! ●

గ్రంథ సమీక్ష

# షేక్స్‌పియర్ సమగ్ర సాహిత్య సంగ్రహం

శ్రీమతి వై. సత్యశ్రీ యం.ఏ., యం.ఇ.డి.

షేక్స్‌పియర్ ఆంగ్ల సాహితీ వనంలో వికసించిన ఒక సుమధుర పుష్పం. ఆయన రచనలు 'నభూతో నభవిష్యతి'. ఆంగ్ల సాహితీ ప్రియులకు షేక్స్‌పియర్ సుపరిచితులే. ఆయన ప్రపంచ నాటక కర్తలలో అగ్రగణ్యుడు. అరుదైన తనశైలిలో, చదువరులను ఆకట్టుకొనేలా రచించిన ఘనత, కీర్తి ఆయనకు దక్కాయి. ఆంగ్ల నాటకాలకు ఒక ఆధునికత ఆపాదించి, కొత్త ఒరవడికి శ్రీకారం చుట్టారు షేక్స్‌పియర్. బ్రిడ్జస్ అన్నట్లు షేక్స్‌పియర్ నాటకాలను 'కావాలని' రచించారా లేక కీట్స్ చెప్పినట్లు 'స్వాభావికంగా' రాశారా అన్న ప్రశ్న సాహితీ ప్రియులకు ఒక సవాలు వంటిది. ఈ ప్రశ్నకు సమాధానం రాబట్టాలంటే విత్తు ముందా చెట్టు ముందా అన్న ప్రశ్నకు సమాధానం శోధించినట్లే ఉంటుంది.

సిడ్నీ లీ రచించిన 'షేక్స్‌పియర్ జీవితం' (Life of William Shakespeare) అనే గ్రంథం, ఆ మహారచయిత జీవిత చరిత్ర గురించి లభ్యమౌతున్న ఒకే ఒక ప్రామాణిక గ్రంథం. షేక్స్‌పియర్ వ్యక్తిత్వాన్ని ఆయన రచనల నుండి విడగొట్టలేమని 'లీ' అభిప్రాయం వెలిబుచ్చారు. డౌడెన్ "Shakespeare His Mind And Art' అనే గ్రంథంలో 'షేక్స్‌పియర్ జీవితంలోని అనేక ఘట్టాలు, అంశాలు, మనోభావాలు చాలావరకు ఆయన రచనల్లో ప్రతిబింబిస్తాయి' అని వ్రాశారు. ఈ వాదనలను అనుసరించి షేక్స్‌పియర్ నాటకాలను నాలుగు భాగాలుగా విభజించటం జరిగింది. అవి (1) ఆయన మొట్టమొదట రాసిన సుఖాంతాలు (Early Comedies) (2) తర్వాతి దశలోని సుఖాంతాలు, చారిత్రక నాటకాలు (Later Comedies and Historical plays) (3) దుఃఖాంతాలు (Tragedies) (4) దుఃఖసుఖాంతాలు (Tragicomedies).

రచనలు దాదాపు అన్ని ప్రముఖ ప్రపంచ భాషలలోకి అనువదింపబడ్డాయి. తెలుగులో కూడా ఇంతకు ముందు కొన్ని అనువాదాలు వెలువడ్డాయి. కానీ శ్రీ అట్లూరి పురుషోత్తం గారి 'షేక్స్‌పియర్ సమగ్ర సాహిత్య సంగ్రహం' అనే 3 సంపుటాలు, నీటన్నిటికీ భిన్నంగా, వినూత్నంగా ఉన్నాయి. శ్రీ పురుషోత్తం గారు ఆ నాటకాల్లోని ఇతివృత్తాన్ని, పాత్రలను, సన్నివేశాలను వచన రూపంలోకి అనువదించి ఒక సరికొత్త ప్రయోగం చేశారు. మొదటి సంపుటిలో భావకవిత్వ విభాగము, రాజకీయ నాటకాల విభాగము, రెండవ సంపుటిలో దుఃఖాంత నాటకాలు, మూడవ సంపుటిలో సుఖాంతాలు చేర్చబడ్డాయి. ఈ మూడు సంపుటాలలో మొత్తం 43 కావ్యాల సంగ్రహం సమకూర్చబడింది. ప్రతి నాటకం మొదట, ఆ నాటకంలోని ముఖ్యపాత్రల పట్టిక, ఆ నాటక ఇతివృత్తాన్ని తెలియచేసే ఒక ఉద్ధరణ ఇవ్వబడ్డాయి. నాటకం చివర ఆ నాటకానికి సంబంధించిన ఉద్ధరణలు, ప్రశంసలు, విమర్శలు పొందుపరిచారు. మధ్యమధ్యలో నాటకాలలోని ప్రముఖ ఘట్టాలు లేక పాత్రల చిత్రాలు కడు రమ్యంగా చిత్రింపబడ్డాయి.

ఈ రోజుల్లో పాఠశాలలు, కళాశాలల్లో ఆంగ్ల భాష యొక్క స్థానం పూర్వం వలె ఉండటం లేదు. పూర్వం కళాశాల స్థాయి ప్రవేశానికి ముందు విద్యార్థికి కనీసం తొమ్మిది నుండి పది సంవత్సరాల ఆంగ్ల భాషా పఠన పరిజ్ఞానం ఉండేది. కానీ ఇప్పుడు పరిస్థితి ఆ విధంగా లేదు. ప్రస్తుత విద్యా విధానం వల్ల, తెలుగు భాష మాధ్యమంగా చదివిన విద్యార్థులకు కేవలం నాలుగైదేళ్ల

ఆంగ్ల భాషా పరిచయం మాత్రమే ఉంటోంది. ఇటువంటి విద్యార్థులకు కళాశాల స్థాయిలో చేర్చబడిన షేక్స్‌పియర్ రచనలను అర్థం చేసుకోవటం కష్టమౌతున్నది. ఈ నేపథ్యంలో, షేక్స్‌పియర్ రాసిన నాటకాలను, కవిత్వాలను, అదే భాషాస్థాయిలో ఇప్పటి ఇంటర్మీడియట్, కళాశాలస్థాయి విద్యార్థులకు అర్థమయ్యేలా బోధించటం ఆంగ్లోపన్యాసకులకు కత్తిమీద సాము వంటిది. ఇప్పటి విద్యార్థులకు షేక్స్‌పియర్ సాహిత్యాన్ని పరిచయం చెయ్యాలంటే దానిని కుదించి మాతృభాషలో, సంగ్రహరూపంలో అందించటమే ఉత్తమమైన మార్గం.

కావున, షేక్స్‌పియర్ సాహిత్యం గురించి అవగాహన ఏర్పరచుకోవాలనుకునే తెలుగు విద్యార్థులకు ఈ మూడు సంపుటాలు మంచి మార్గదర్శకం కాగలవు. అంతేకాక, ఆంగ్లభాషా పరిజ్ఞానం లేని, షేక్స్‌పియర్ సాహిత్యం పట్ల అభిమానం ఉన్న తెలుగు పాఠకలోకానికి కూడా ఈ మూడు సంపుటాలు, ఆ మహారచయిత సాహిత్యం చదవలేకపోయామనే లోటును తప్పక తీరుస్తాయనటంలో సందేహం లేదు. (comparative literature). గురించి పరిశోధనలు సాగిస్తున్న తెలుగు పరిశోధకులకు ఇవి ఎన్‌సైక్లోపీడియాల వంటివి. శ్రీ పురుషోత్తం గారు తన ముప్పై ఏళ్ల 'షేక్స్‌పియర్ సాహిత్య బోధనానుభవాన్ని' జోడించి, ఈ పుస్తకాలను వెలువరించటం తెలుగు పాఠకులకు ఒక వరం వంటిది. ఆయన కృషి నిజంగా ప్రశంసనీయం. నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగు ప్రొఫెసర్ డాక్టర్ తమ్మారెడ్డి నిర్మల 'ముందుమాట' రాశారు. ప్రముఖ చిత్రకారుడు బాలి ఈ సంపుటాలకు చక్కని కవర్ డిజైన్ అందించారు. పుస్తకాల లోపలి రేఖా చిత్రాలను కూడా వీరు మనోహరంగా చిత్రించారు. ఈ మూడు సంపుటాల వెల కూడా అందరికీ అందుబాటులోనే ఉంది. ప్రతి ఇంటా ఉండవలసినది ఈ 'షేక్స్‌పియర్ సమగ్ర సాహిత్య సంగ్రహం.'

రచన: శ్రీ అట్లూరి పురుషోత్తం.
వెల : 3 సంపుటాలు రూ. 160/-లు. U.S. $ 9-40.
ప్రతులకు: 1. వివేకా పబ్లికేషన్స్, గుణదల సెంటర్, విజయవాడ.
2. విశాలాంధ్ర బుక్‌హౌస్, అన్ని బ్రాంచీలు.
వెల: మొదటి సంపుటి రు. 55/-, రెండవ సంపుటం రు. 50/-, మూడవ సంపుటం రు. 55/-
పుటలు: మొదటి సంపుటం 198, రెండవ సంపుటం 159 ,మూడవ సంపుటం 197.

## Steps to Stress - proof your body

### Deal with boredom

We tend to think of stress and pressure as being caused by too much activity. But inactivity and boredom can be just as great a cause of stress. If you feel that your life is too dull then take up a pastime or hobby which you find rewarding. Do something that you can become really good at and something that you can take a pride in. Start evening classes at a local college. And be prepared to take risks occasionally - even if it means failing occasionally.

# పరిశోధన

– శారద

(1995 లో జరిగిన ఆం.ప్ర. అసెంబ్లీ ఎలక్షన్లకు సంబంధం లేదని మనవి – సం. మిసిమి)

'స్త్రీ' హృదయం లోతులు తీసేందుకూ, ఆమూలాగ్ర పరిశోధన చేసేందుకూ, పురుషుడు ఒక లేబరేటరీ ఓపెన్ చేశాడు. లేబరేటరీ నిండా ప్రణయకావ్యాలూ, జగన్మోహనుల వర్ణచిత్రాలు నింపి, పరిశోధన ప్రారంభించాడు. ఒక శోధననాళిక గూడా తెచ్చాడు. స్త్రీ పురుషుణ్ణి, అందంకోసమా, అనురాగంకోసమా, శరీరంగురించా, దేనికోసం ప్రేమిస్తోంది? ఈ విషయం తెలీక పురుషుడు 'స్త్రీ' హృదయాన్ని శోధననాళికలోవేసి, ప్రశ్నించాడు కాస్తవేడిచేసి, 'స్త్రీ' హృదయం టింగ్, టింగ్ అని ఎగతాళిగా స్పందించిందేకాని ఏమీ జవాబివ్వలేదు. పురుషుడు విసుక్కుని ఇంకా కాస్త వేడిచేసి అడిగాడు 'స్త్రీ' హృదయాన్ని, సమాధానం లేదు. పురుషుడు, శోధననాళికని ఎగాదిగాచూచి, ఏదో కనుక్కున్న వాడల్లే, ''స్త్రీ పురుషుడి సౌందర్యం చూసి ప్రేమిస్తోంద''న్నాడు.

కాని శోధన నాళికలోని స్త్రీ హృదయం ఫక్కున నవ్వింది విషాదంసూచిస్తూ. పురుషుడు ఉలిక్కిపడి శోధన నాళికలోకి చూశాడు. శోధననాళిక రంగుమారుతోంది. పురుషుడు, ఇలా అనుకున్నాడు: ''స్త్రీ పురుషుణ్ణి గతిలేకా, రక్షణలేకా, ప్రేమిస్తోంది, స్త్రీ అబల'' అని జాలిగా.

కాని ఈ సిద్ధాంతంమీద పురుషుడు ఎక్కువసేపు నిలవలేదు. ఒకరోజు పురుషుణ్ణి 'స్త్రీ' చెంపచెళ్ళుమనేట్టు బాదింది. ఖడ్గంతో, యుద్ధానికి దిగింది. పురుషుడిమీద రాజ్యం చేసింది. ఇహ ఎట్లాగతి? అని పురుషుడు దిగులుపడ్డాడు.

పురుషుడు 'స్త్రీ' హృదయాన్ని మళ్ళీ శోధననాళికలో నేసి వేడిచేశాడు. భయంకరమైన రంగులోకి మారింది, స్త్రీ హృదయం. పురుషుడు భయపడి శోధననాళిక దూరంగా పెట్టి కళ్ళు మూసుకుని ఆలోచించాడు.

''స్త్రీ.... శక్తి, అది యేమన్నా చేయగలదు'' అన్నాడు పురుషుడు.

పరిశోధన, ఇంతటితో ఆపలేదు పురుషుడు. ఇంకా చేస్తున్నాడు... స్త్రీకోసం రాజ్యాలూ, మేడలు, ఉద్యోగాలూ, స్కూలు పరీక్షలు, అన్నీ వొదలుకుంటున్నాడు పురుషుడు: మరి పరిశోధన తేలడం ఎల్లా? ఇంకా రాత్రనక, పగలనక, వాననక, యెండనక స్త్రీవెంట తిరుగుతున్నాడు పెంపుడు కుక్కలాగ.

శోధన నాళికలోని 'స్త్రీ' హృదయాన్ని పురుషుడు గాఢంగా ముద్దుపెట్టుకుని ''స్త్రీ' హృదయం, ఒక అయస్కాంతపురాయి, దానికి పురుషుణ్ణి ఆకర్షించడం తప్ప వేరే ఉద్యోగం లేదు'' అని తీర్మానించాడు. తన బరువెక్కిన హృదయానికి కాస్త విరామం కల్పించటానికి.

కాని అప్పటికీ విరామం చిక్కలేదు పురుషుడికి. ''ఎబ్బే, స్త్రీ పురుషుడికి ఆస్తి. చరాస్తి అంతే!'' అనుకున్నాడు గట్టిగా శ్వాసపీల్చి.

పోనీ ఈ అభిప్రాయం ఎక్కువసేపు నిల్చిందా? స్త్రీ కన్నీళ్లు పెడితే చూసి, ''పాపం స్త్రీ, భోగ్యవస్తువు, కాని, ఆమె పరాయత్త'' అని విలపించాడు. పురుషుడు తన విలాపం మానుకుని, కళ్లుతుడుచుకుని టెస్టుట్యూబ్లోకి చూశాడు. 'స్త్రీ' హృదయం అందులో లేదు! పురుషుడికి పూర్వాభిప్రాయం సడలి, వొళ్ళుమండింది. ఇలా పెద్దగా అరిచాడు, ''అరెరే! స్త్రీ లేచిపోయిందే? దీన్ని నమ్మరాదు. స్త్రీ వంచకురాలు'' అని కోపంగా అన్నాడు.

చివరికి పురుషుడు విసుగెత్తి, ''స్త్రీకి హృదయమే లేదసలు. ఇన్నాళ్ళుబట్టి పరిశోధించింది, దేన్నో అంతుతేలటం లేదు'' అన్నాడు. పైగా, అసలు ''స్త్రీ లేకపోతేనే, పురుషుడికి ఏ మంచి జరిగినా 'స్త్రీ'తో పురుషుడి సంబంధం నీచం'' అని తేల్చివేశాడు.

''ముక్కు మూసుకుని, అడవులకిపోయి, బ్రహ్మచర్యం అవలంభించి ఇంద్రియనిగ్రహం, చేయడం మంచిది'' అని నిబ్బరంగా ఆలోచిస్తూ పురుషుడు, తన చేతిలో శోధన నాళిక చిదగ్గొట్టి, లేబరేటరి, తగలెట్టాడు.

''పిచ్చి పురుషుడా, నువ్వేం కనుక్కున్నావ్ నన్నుగురించి, ఇంతకాలం ఊహాగానం చేశావు అంతే'' అంది, 'స్త్రీ' తగలడిపోతున్న లేబరేటరీ మంటల్లోంచి పకపక నవ్వుతో.

పురుషుడు విస్తుపోయి, ''నిజం?'' అని అడిగాడు, స్త్రీ స్వరాన్ని.

''స్త్రీ'' స్వరం ''నిజమే'' అంది.

అయితే, పురుషుడు, ''స్త్రీ''కి ఓడిపోతల్చుకోలేదు గావును, గంభీరంగా స్టేజీ ఎక్కి, మీసంమెలేసి, ''పాపం, 'స్త్రీ' అణగారిపోతోంది అస్వాతంత్ర్యంతో; ఆమెకి స్వతంత్రం కావాలిప్పుడు, అని పెద్దగా 'మైక్'లు దద్దరిల్లేట్టు అరిచాడు.

'స్త్రీ' స్వరం వికటాట్టహాసం చేసింది. ప్రతిధ్వనిగా! పైగా ఛాలెంజి చేసింది. ''నువ్వు నన్ను గురించి యేమీ శ్రమపడక్కరలేదు'' అని.

**లోగడ ఇదే సంపాదకత్వం 1948లో వెలువడిన**

**'జ్యోతి' పత్రిక నుండి పునర్ముద్రణ**




ప్రముఖ జాతీయ తెలుగు దినపత్రిక ''ఈనాడు '' సౌజన్యంతో

# HISTORICAL EVOLUTION OF LOKAYATA

- Late **Dr. K.B. KRISHNA**
M.A., Ph.D. (Harvard)

The brief history of the word Lokayata, even though culled from various opposition schools, throws some light on the growth and development of this thought. The word Lokayata meant variously at various periods.

About 600 B.C. the word Lokayata was used in a complimentary way as the name of a branch of Brahmin learning and probably meant nature-lore- Wise sayings; riddles, rhymes, and theories handed down by tradition, as of cosmogony, of elementary physics, even of anatomy, and knowledge of the nature of precious stones, and of birds, beasts and plants. To be a master of such lore was then considered by no means unbecoming to a learned Brahmin though it ranked, of course, below his other studies.

This view of Lokayata, meaning "nature-lore" is contradicted by Tucci. Tucci does not take into consideration the developmental view of the word "Lokayata". Nor could he explain why a Brahmin should be versed in Lokayata, if it only meant, "materialism". Another writer Raja Krishna Mukhopadhyaya also takes a logical view of the meaning of Lokayata like Tucci. He says that Lokayata asserts that this world, or Loka, is. No one denies these possible meanings of Lokayata. What they forgot was the historical context of the use of the word.

These speculations of nature-lore-(this is what Lokayata meant at this period) supplied a basis for upanishadic cosmological speculations. Emphasis was placed on the physical side and on elements that comprised the universe.

As the amount of this knowledge grew larger, and several branches of natural science were regularly studied, an exclusive acquaintance with Lokayata became looked upon with disfavour. Because it was tending to emphasise more and more the physical, material side of things.

In the Buddhist literature the word is used as a synonym for sophists- useless disputants. The change can be explained by the fact that Lokayatas tended to emphasise more and more the material aspects of knowledge which undermined Brahmanic and equally Buddhistic, Jaina speculations.

In the first half of the eighth century A.D. Kumarila uses the word as a mere term of abuse and in the sense of infidel. Sankara uses it for atheism. In the fourteenth century Sayana Madhava ascribes to the Lokayatikas the most extreme forms of the let-us-eat-and-drink-for-tomorrow-we-die view of life; of Pyrrhonism in philosophy, and of atheism in theology.

This change on the part of the subjective estimates of the opposition writers is due to the change in the objective content of Lokayatika itself. Lokayata of 600 B.C. is not the same as Lokayata of 14th century A.D. In 6th century B.C. it took the form of naturalism. In the Upanishadic period it toook the form of cosmological speculations, emphasising "elements". In the pre-Buddhist period, it tqok the form of a violent controversy, against theism. No wonder, it was characterised as "Violent disputation". In the early Christian Era, when Brahmanism triumphed, it took the form of direct atheism. In the fourteenth century when the social order, which now obtains in India, got fully stratified, it took the form of direct materialism. Most writers do not emphasise this aspect of the change in the objective content of Lokayata. They imbibed most of the prejudices of the opposition writers.

What evidence is there to show that there are such changes in the objective content of Lokayata? There is evidence to show that Lokayata passed through five distinct stages of development in the course of it's evolution.

1. In the initial stage they were pure at heart, blameless in action and free from all conventions, having neither virtue nor vice. This may correspond to the nature-lore emphasised by Lokayata at this time.

2. In the second stage they developed a spirit of intolerance ana opposition, accepting the authority of none, yet having no positive problem of their own to solve. This may correspond to the anti-Vedic or anti-Brahmanic movement of the day.

3. The third stage revealed some positive theories-

Svabhavavada, recognition of perception as a source of knowledge. This corresponds to the ontological arguments of the Lokayatas. Their positive theory of knowledge is revealed here for the first time. It is said that they are called Lokayata at this stage. It is difficult to sustain this view.

4. In the fourth stage an extreme form of hedonism formed the most important form of this school. Two reasons might be advanced for such an extreme form. One is the increasing influence of Brahmanism. The other is the corruption of the original ideas of Lokayata. Both contributed to the hadonistic character of Lokayata at this stage. It is said that they got the designation of Charvaka at this stage. Extreme assertions of the Brahmins provoked extreme doctrines of Lokayata. Extreme doctrines of Lokayata created in turn virulent criticisms of the Lokayata. This was responsible for the emergence of various schools of Lokayata. Of course, corruption also is another factor. Gunaratna of 14th century A.D. speaks of Dhurtta and Susiksita Charvakas. The Dhurtta Charvakas held that there was nothing but the four elements of earth, water, air, and fire and that the body was but

the result of atomic combination. The Susiksita Charvakas held that there was a soul apart from the body but that it also was destroyed with the destruction of the body. At this stage, they even accepted inference, though in a restricted sense, as a source of knowledge and did not deny the existence of ether as a fifth element. This shows how the traditional treatment of Lokayata is wrong. The dynamics of time and space are forgotten.

5. In the fifth stage, the stage when Madhava recounts these Lokayatas, they are lumped together under one name Lokayata. It is at this stage that the Brahmanic writers delight in discrediting Lokayata beyond moderation. These changes attest to the change in the objective content of Lokayata. What led to these changes, and what is the social composition of the writers, the subject-objects of these changes-we cannot say definitely.

If this historical view is accepted, there is no danger of translating the word Lokayatika as "Materialism," because the word "Materialism" in western thought too, meant variously at various times. The materialism of Bacon is different from that of Hobbes. "Hobbes shattered the theistic prejudices of Bacononian "materialism". Dodwall, Coward, Hartley, Priestly similarly shattered the last theological bars that still hemmed in Locke's sensationalism". What indeed is agnosticism but, to use expressive Lancashire term, "shamefaced" materialism? Again English materialism is different from French materialism, although Bacon, Hobbes, and Locke are the fathers of French materialism. The French materialists did not limit their criticism to matters of religious belief. They extended it to whatever scientific tradition or political institution they met with. Again the materialsim of Feurbach and Spinoza differ from that of Dialectic materialism. This clearly shows that even in the West "materialism" meant differently at different times.

Therefore, there is no danger of translating the word "Lokayata" into "materialism" if we do not lose sight of historical sense. All writers on Lokayatika, whether they are aware of the developmental view or not, use it in the sense of Materialism. Brihaspati, Kautilya, Vatsyayana, Haribhadra Suri, Abhiddha-Kar̃na, Santa Rakṣhita, Sankara, Vachaspati Misra, Bhaskara, Krishna Misra, Gunaratna, Nilakanta Madhusudana, and Madhavacharya all use the word Lokayata in the sense of a materialist school of Philosophy.

**(FROM 'STUDIES IN HINDU MATERIALISM')**



Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyoti Process Pvt. Ltd., 1-1-60/5, R.T.C.Cross Roads, Hyderabad-20. Ph: 612337, 612436.

**Editorial NEST**

Plot No.337-A, Road No.10, Jubilee Hills, Hyderabad-500 033. Phone: 247717.



జిడ్డు కృష్ణమూర్తి
శతజయంతి సంవత్సరం, 1995

